Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు   స్థాపితం: 1930   జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*




సంపుటి: 82 • సంచిక: 28 • 15-7-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# హైకోర్టులో కేసుతో జగన్‌కు మేలు?

**● ఈ కేసు వల్ల జగన్మోహన్‌రెడ్డికి జరిగే నష్టం కంటే కలగనున్న మేలే ఎక్కువని న్యాయనిపుణులు భావిస్తున్నారు.**



వైఎస్ జగన్ అక్రమ ఆస్తులకు సంబంధించిన కేసులో సిబిఐ ప్రాథమిక విచారణకు ఆదేశించింది హైకోర్టు. కాంగ్రెస్ ఎమ్మెల్యే, ప్రస్తుత మంత్రి శంకరరావు జగన్ అక్రమ ఆస్తులపై న్యాయమూర్తులకు వ్రాసిన లేఖను విచారణార్హమైన కేసుగా పరిగణించిన హైకోర్టు, తదుపరి విచారణ పొడిగించాలా వద్దా అన్న నిర్ణయం తీసుకోవడం కోసం ఈ ఆదేశాలు జారీ చేసింది. శంకరరావు లేఖలో పేర్కొన్న ఆరోపణలకు ప్రాథమిక సాక్ష్యాలు వున్నదీ లేనిదీ మాత్రం విచారిస్తుంది సిబిఐ. వాటి నిర్ధారణకు ఎఫ్ఐఆర్ నమోదు చేయడం కానీ, దర్యాప్తు చేయడం కానీ జరగదు.

ఈ లేఖలో శంకరరావు ప్రధానంగా పేర్కొన్న అంశాలు – జగన్‌కు సంబంధించిన సాక్షి పత్రిక, టీవీ ఛానల్, భారతీ సిమెంట్, సాండూర్ పవర్ కంపెనీలలో రాష్ట్రంలోని పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థలు భారీ మొత్తాలు పెట్టుబడి పెట్టడం, ఆ సంస్థలన్నిటికీ వైఎస్ ప్రభుత్వం ఏదో ఒక రూపంలో ప్రయోజనాలు చేకూర్చడం, 2004 నుంచి 2009 మధ్య జగన్ సమర్పించిన ఇన్‌కంటాక్స్ లెక్కలలో ఆస్తులు, రాబడి అనూహితంగా పెరిగిపోవడం.

## "దేముడున్నాడు"

ఈ ఆరోపణలన్నీ నిజాలని జగన్ కూడా ఒప్పుకోక తప్పదు. అయితే అవి చట్టం దృష్టిలో నేరాలుగా నిర్ధారించే అవకాశం వుందా లేదా అన్నది ఇప్పటి ప్రశ్న. తన మీద సిబిఐ విచారణకు హైకోర్టు ఆదేశించిందని తెలియగానే జగన్ చేసిన వ్యాఖ్య – "దేముడున్నాడు" అని మాత్రమే. నా మీద దేముడి కృప ఎప్పుడూ వుంటుంది, ఇటువంటి సమస్యల నుంచి బయటపడే మార్గం ఆయనే చూపిస్తాడని చెప్తున్నాడు జగన్.

## అన్నీ నిజాలే కానీ చట్టవ్యతిరేకమనలేరు

వైఎస్ రాజశేఖర్‌రెడ్డి రాష్ట్ర ప్రభుత్వానికి చెందిన గనులు, భూములు, ఇతర వనరులను యదేచ్ఛగా పారిశ్రామికులకు కట్టబెట్టిన మాట వాస్తవం. ఎస్ఇజడ్‌లు, పారిశ్రామిక వాటికలు, ఓడరేవులు, ఐటి పార్కులు, ఫార్మా కాంప్లెక్స్‌లు తదితరాల పేరుతో దాదాపు లక్ష ఎకరాలు పందారం చేశారాయన. తాను చేసే ప్రతి పనికీ సంబంధిత పారిశ్రామికవేత్తల నుంచి పరిహారం రాబట్టే వాడన్నది జగమెరిగిన సత్యం. ఆ పరిహారాన్ని దొంగచాటుగా కాకుండా, ప్రత్యక్షంగా తన కుమారుడి కంపెనీలలో పెట్టుబడుల రూపంలో స్వీకరించే వాడనీ లోకానికంతా తెలుసు. డబ్బు లేకుంటే రాజకీయం చేయడమెట్లా అని విమర్శకులను ఎదురు దబాయించే వాడాయన.

అయితే ఈ పాపాలకు, జగన్‌కు లంకె కుదిర్చి చర్య తీసుకోవడం అంత సులభమైన విషయం కాదు. చేసేది తప్పుడు పనే అయినా, చట్టానికి దొరకకుండా చేయడంలో జగన్ తెలివి అమోఘం.

## కనిమొళికి దీనికి కుంభకోణంలో తేడా

కరుణానిధి కుమార్తె కనిమొళి కూడా ఇదే ప్రకారం తన కంపెనీకి పెట్టుబడులు స్వీకరించి, సిబిఐ వలలో చిక్కి, జైలుకు పోయింది కాబట్టి జగన్ కూడా అదే పరిస్థితి ఎదుర్కోక తప్పదని

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




ఈ వర్షానికి మీ కొంపమునిగేట్టుంది సార్!

# రాష్ట్రపతి పాలన ఖాయం!

రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించడానికి కేంద్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకొన్నట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. రాజ్యాంగం మీద ప్రమాణం చేసి, ప్రభుత్వంలో భాగస్వామ్యులైన మంత్రులు అదే ప్రభుత్వం పై నిరసన వ్యక్తం చేస్తూ దీక్షలకు దిగడం, ప్రభుత్వాన్ని స్థంభింప చేస్తామని రోజు ప్రకటనలు చేయడం ప్రభుత్వానికి చాలా ఇబ్బందిగా వుంది. 8 మంది తెలంగాణ మంత్రులు దీక్షలో పాల్గొంటున్నారు. మొత్తం 13 మంది మద్దతు ఇస్తున్నారు. మరొకప్రక్క జెఎసి ఆధ్వర్యంలో వేర్పాటు ఉద్యమం తీవ్ర రూపం ధరిస్తున్నది. రైల్ రోకో పేరుతో ఒక రోజంతా హైదరాబాదుకు దేశంలోని ఇతర ప్రాంతాలతో సంబంధాలు తెంపి వేశారు. కాలేజీలు, పాఠశాలలు తరచూ మూత పడుతున్నాయి. పులి మీద పుట్ర వలె ప్రభుత్వ ఉద్యోగుల సంఘం సమ్మె నోటీసు ఇచ్చింది. ఆగష్టు 8తేది నుంచి నిరవధికంగా సమ్మెకు పూనుకొంటున్నారు. ఈ పరిస్థితులలో రాష్ట్రంలో పరిస్థితులను చక్కదిద్దే సమర్థత ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డికి లేదని కేంద్రం ఒక నిశ్చయానికి వచ్చింది. రాష్ట్రపతి పాలన విధించి, ఒక ఏడాదిపాటు వ్యవధి తీసుకొని, అప్పటికి పరిస్థితులు చక్కబడితే, మళ్లీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవచ్చన్న ప్రణాళికతో ఈ నిర్ణయం తీసుకొన్నట్లు చెప్తున్నారు.

గత ఒకటిన్నర ఏడాదిలో రాష్ట్రపతి పాలన ప్రస్తావన రావడం ఇది మూడవసారి. 2009 డిసెంబర్ 9తేది చిదంబరం ప్రకటన తర్వాత తలెత్తిన పరిస్థితులను అదుపు చేయడానికి రాష్ట్రపతి పాలన పెట్టక తప్పదని భావించారు. కానీ కెసిఆర్ శ్రీకృష్ణ కమిటీ నియామకానికి అంగీకరించడంతో ఆ ప్రమాదం తప్పింది. తిరిగి మొన్న తెలంగాణ ఎమ్మెల్యేలు, ఎమ్పీల మూకుమ్మడి రాజీనామాలతో మరొకసారి ఆ అవసరం ఏర్పడింది. ఏట్లనో దాన్ని కూడా అధిగమించారు. కానీ ఇప్పుడు పరిస్థితి చెయ్యి దాటిపోయేట్లు కన్పడుతున్నది. ఈ విషయం ముఖ్యమంత్రికి కూడా సూచన ప్రాయంగా తెలియజేసారని, వారం పది రోజుల లోపల ప్రభుత్వంలో అత్యవసరంగా చేసుకోవలసిన పనులేమైనా వుంటే పూర్తి చేసుకోమని సలహా ఇచ్చారని చెప్తున్నారు.

రాష్ట్రపతి పాలన అంటే, శాసనసభను తాత్కాలికంగా సస్పెండ్ చేస్తారు. ప్రభుత్వాన్ని రద్దు చేసి గవర్నర్ నిర్వహణకు అప్పచెప్తారు. ఎమ్మెల్యేల పదవులు పోవు కానీ, వారికి ప్రోటోకాల్ వుండదు. ప్రభుత్వ కార్యక్రమాలు, సభలకు పిలవడం జరగదు. అంతా అధికారుల రాజ్యం నడుస్తుంది. రాజ్యాంగం ప్రకారం రాష్ట్రపతి పాలన గడువు ఆరు నెలలు మాత్రమే. అంత కంటే అధికమైతే లోక్‌సభ ఆమోదంతో పొడిగించాలి. ప్రతి ఆరు నెలలకు ఒకసారి లెక్కన ఎన్నిసార్లయినా పొడిగించవచ్చు.

# వైరం సృష్టించవద్దు

తెలంగాణ ఏర్పాటును అడ్డుకోవడానికి సీమాంధ్ర రాజకీయవాదులు చేస్తున్న ప్రయత్నం పెడదారి పడుతున్నది. ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎవరి అభిప్రాయం వారు చెప్పుకొనే స్వేచ్ఛ వుంటుంది. కానీ ఇతరుల మనుసులను గాయపరచే, హేళన చేసే హక్కు మాత్రం లేదు. తెలంగాణ ఏర్పాటు సమస్య ఈనాటిది కాదు. దానికి అరవై ఏళ్ల సుదీర్ఘ చరిత్ర వుంది. దాని వెనుక ఎన్నో పోరాటాలు, ప్రాణత్యాగాలు వున్నాయి. స్వావలంబన కోసం, స్వయంపరిపాలన కోసం, తమ అభివృద్ధిని తమకు నచ్చిన మార్గంలో జరిపించుకోవడం కోసం తెలంగాణ ప్రజలు కొన్ని దశాబ్దాలుగా అలుపులేని పోరాటం చేస్తున్నారు. ఆంధ్ర, తెలంగాణలు ఒకటిగా కలిపి విశాలాంధ్ర స్థాపించే రోజు కూడా వారు తమ అభ్యంతరాలు తెలిపారు. అది మనస్ఫూర్తిగా జరిగిన ఏకీకరణ కాదు. సాక్షాత్తు జవహర్‌లాల్ నెహ్రూ కూడా ఈ నిజాన్ని అంగీకరించారు. కలిసి వుండడం ఇష్టం లేకపోతే, కొంత కాలం తర్వాత రెండు ప్రాంతాల వారూ రాజకీయ విడాకులు తీసుకోవచ్చునని స్పష్టంగా ప్రకటన చేశారాయన.

చరిత్రలో ఎన్నోసార్లు జరిగిన తెలంగాణ ఉద్యమాలకు ఆంధ్ర ప్రాంతం ప్రజలు కానీ, నేతలు కానీ అడ్డం పోలేదు. ఏనాడూ వాటిపట్ల తమ అశాంతిని తెలపలేదు. పై పెచ్చు, తెలంగాణ నుంచి తమను విడదీయమని కోరుతూ జై ఆంధ్రా ఉద్యమం నడిపారు. దానికి ఆనాడు ఆంధ్ర ప్రాంతం ప్రజల నుంచి అనూహిత మద్దతు లభించింది. ఆనాడు ఆ ఆందోళనను ఇందిరమ్మ ఉక్కు పాదంతో అణిచి వేయబట్టి సరిపోయింది కానీ, లేకుంటే నలభై ఏళ్ల క్రితమే ఆంధ్ర, తెలంగాణ రాష్ట్రాలు ఏర్పడి వుండేవి. చారిత్రకంగా కూడా ఈ రెండు ప్రాంతాలూ ఏనాడూ కలిసి లేవు. రాజుల కాలంలో కానీ, బ్రిటీష్ పరిపాలనలో కానీ రెండు ప్రాంతాల మధ్య సంబంధ బాంధవ్యాలు లేవు. 1990 దశకం తర్వాత, సాఫ్ట్‌వేర్ రంగం పుట్టుకొచ్చిన పిమ్మట మాత్రమే ఆంధ్ర ప్రాంతం నుంచి హైదరాబాదుకు సామాన్యుల వలస ప్రారంభమైనది. అప్పటి వరకు ప్రభుత్వంతో పని వుండే రాజకీయ వాదులు, కాంట్రాక్టర్లు, ఉద్యోగులు మాత్రమే హైదరాబాదులో స్థిర పడ్డారు. సరిగ్గా అదే కాలంలో హైదరాబాద్ నగరం శరవేగంతో విస్తరించింది. ఇప్పుడు అదే హైదరాబాద్‌ను చూపించి, తెలంగాణ ఏర్పాటును వ్యతిరేకిస్తున్నారు కొందరు సీమాంధ్ర వ్యాపారవేత్తలు. వారి ఆసక్తి, తమ ఆస్తి పాస్తుల మీదనే తప్ప ఇదేమీ సిద్ధాంతపరంగా, ప్రజల మీద అనురక్తితో చేస్తున్న ఆందోళన కాదు. తమ ఆస్తుల రక్షణ కోసం, తమ రాజకీయ స్వార్థం కోసం జరుపుతున్న ప్రయత్నం.

నిజం మాట్లాడాకోవాలంటే తెలంగాణ ఏర్పాటును ఆంధ్ర ప్రాంతం ప్రజలు వ్యతిరేస్తున్నట్లు చిన్న ఆధారం కూడా లేదు. 2004 ఎన్నికలలో చంద్రబాబు సమైక్య నినాదంతో, కాంగ్రెస్ పార్టీ తెలంగాణ ఏర్పాటు హామీతో పోటీ చేశాయి. ఆంధ్ర ప్రాంతంలో చంద్రబాబు పార్టీ మట్టి పాలైంది. కాంగ్రెస్ అఖండ మెజార్టీ సాధించింది. 2009 ఎన్నికలలో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి, తెలంగాణ ఏర్పడితే హైదరాబాదుకు వెళ్లడానికి వీసా కావాలని హెచ్చరించాడు. చంద్రబాబు తెలంగాణ అనుకూల విధానం ప్రకటించాడు. కానీ ఆ ఎన్నికలలో కాంగ్రెస్ సీట్లు సగానికి తగ్గాయి. తెలుగుదేశం సీట్లు రెట్టింపు అయ్యాయి. అదే తెలంగాణలో మాత్రం ప్రతి ఎన్నికలోనూ ప్రజలు తెలంగాణ ఏర్పాటు కోరే పార్టీలనే గెలిపిస్తూ వస్తున్నారు. అక్కడి ఎన్నికలలో అదొక్కటే అంశంగా నడుస్తున్నది.

అయితే సీమాంధ్ర నేతలకు తమ ప్రాంతం కోసం ఆందోళన చేసే హక్కులేదని మేమనడం లేదు. వారి స్వార్థం కోసమైనా సరే, వారికి నచ్చిన ఆందోళన జరిపే స్వేచ్ఛ వారికి వుంది. అయితే, అది పెడదారి పట్టకూడదన్నదే మా అభిప్రాయం. లగడపాటి రాజగోపాల్ వంటి నేతలు తెలంగాణ ప్రజలను రెచ్చగొట్టే రీతిలో ప్రసంగాలు ప్రకటనలు చేస్తున్నారు. వారిని గేలి చేస్తూ మాట్లాడుతున్నారు. దీనివల్ల రెండు ప్రాంతాల మధ్య అనవసర వైరం తలెత్తుతున్నది. రెండు ప్రాంతాల ప్రజల మధ్య వైషమ్యాలు పెరుగుతున్నాయి. ఈ పోకడ క్షమించరానిది. ప్రోత్సహించకూడనిది. తమ రాజకీయ ప్రయోజనాల కోసం రెండు ప్రాంతాల మధ్య వైరం సృష్టించవద్దని మనవి చేస్తున్నాము. రాష్ట్రాల ఏర్పాటు కంటే ప్రమాదకరమైన పరిస్థితులు కొనితేవద్దని విజ్ఞప్తి చేస్తున్నాము. ఒక రాష్ట్రమైనా, రెండు రాష్ట్రాలైనా తెలుగు ప్రజలు కలిసి వుండాలే తప్ప, శత్రువుల వలె కొట్లాడుకొనే పరిస్థితి తలెత్తకూడదు. ఆ పుణ్యం కట్టుకోవాలని చూసే రాజకీయవాదుల పట్ల, వారు ప్రేరేపిస్తున్న ఉద్యమాల పట్ల అప్రమత్తంగా వుండడం తెలుగువారి కర్తవ్యం.

## జనవాణి

### వాస్తవాలు ఎరుగరా?

ఆర్టీసి బస్సు చార్జీ రైలు చార్జీ కంటే మరీ ఎక్కువగా వుంది. ఉదాహరణకు కావలికి ప్యాసింజర్ రైలులో తొమ్మిది రూపాయలు వసూలు చేస్తుంటే ఆర్డినరీ ఆర్టీసి బస్సులో 28రూపాయలు వసూలు చేస్తున్నారు. ఆర్టీసి ఎక్స్‌ప్రెస్ బస్సు చార్జీలైతే భరించేట్లు లేవు. రేట్లు విపరీతంగా వుంటే ఆక్యుపెన్సీ ఎక్కడ నుంచి వస్తుంది. ఈ విషయాన్ని మరచి డీజిల్ రేట్లు పెరగాయని మళ్లీ ఆర్టీసి టిక్కెట్ల రేట్లు పెంచుతామని ఆర్టీసి పాలకవర్గం ప్రభుత్వాన్ని అభ్యర్థించడం దారుణం. నిరర్థక డిపోలను అమ్మివేయడం, రద్దీ లేని మార్గాల్లో మినీబస్సులతో ఆర్టీసి ఆర్థికంగా కుదుటపడుతుందని ఆర్టీసి వున్నతాధికారులు, పాలకవర్గం గ్రహిస్తే బాగుంటుంది.

పి.శ్యామూల్ — కావలి

### ఇదేం న్యాయం?

ప్రతిరోజూ పెట్రోల్ రేటుపై వడ్డన సగటుజీవిని క్రుంగదీస్తోంది. అంతర్జాతీయ మార్కెట్‌లో ముడిచమురు ధరతో ముడిపెడుతూ పెంపు అనివార్యమంటూ ఆర్థికమంత్రి ప్రణబ్‌ముఖర్జీ చెప్పడం దారుణం. పెట్రోల్, డీజిల్ రేట్లు పెంపకం వల్ల రవాణా చార్జీలు పెరిగి నిత్యావసర వస్తువుల ధరలు పెరిగిపోయాయి. ఈవారం పదిరోజుల వ్యవధిలో కూరగాయలు, నిత్యావసర వస్తువుల ధరల్లో పెరుగుదలకు పెట్రో వడ్డనే కారణం. ఏదో రాయితీల తాయిలాలతో ఓటర్లను ఆకర్షించడం, దొడ్డిదారిన పన్నులు పెంచడం ప్రభుత్వాలకు అలవాటైపోయింది.

పి.అరుణకుమారి — నెల్లూరు

### ప్రజలకే ఇబ్బందులు!

పేద విద్యార్థుల ఫీజు రీయంబర్స్‌మెంట్‌కు నిధులు లేవు. అదే కారణంతో ప్రభుత్వ ఆసుపత్రులలో మందులు కొనుగోళ్లు లేవు. కుక్క కాటు వ్యాక్సిన్ లేదు. కానీ ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలకు భారీగా జీతభత్యాలకు తోడు వైద్యఖర్చులు, టిఏ నాలుగురెట్లు పెంపుదల చేశారు. ప్రజాస్వామ్యంలో పాలకులు ఇష్టారాజ్యంగా వ్యవహరించడం తగదు. ప్రజలు తగిన సమయంలో బుద్ధి చెబుతారు.

కె.నరేష్ — నెల్లూరు

### బాబా బంగారు పాదుకలు వాడలేదు!

జూలై 1 తేది 'జమీన్‌రైతు' సంచిక జనవాణి శీర్షికలో సోలా జానకిదేవి వ్రాసిన ఉత్తరం చదివాను. సత్యసాయిబాబా వాడుతున్న పాదుకలపై హిందూ దేవతల బొమ్మలుండడంపై అభ్యంతరం వ్యక్తం చేశారామె. అసలు విషయమేమిటంటే బాబా బతికున్న రోజుల్లో బంగారు పాదుకలు వాడలేదు. ప్రత్యేక ఉత్స

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

18-7-1941
పేజీలు : 10 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

### స్వతంత్ర నిర్యాణం

స్వతంత్ర ముద్రణాలయం విక్రయించబడింది. దీనిచే 14 సంవత్సరాలుగా తన రాజకీయ పక్షవాణిగా బెజవాడ రామచంద్రారెడ్డి గారిచే నడుపబడుచుండిన "స్వతంత్ర" పత్రిక ఆగిపోయినది.

ఔను॥ వసంత రుతువులో మధుర ధ్వనులు దనిపిన కోకిలకు శిశిర రుతువులో ఏమి పని?

### జైలు చెణుకులు

మీకొక సంతోష వార్త చెవిన వేస్తాను. మా హనుమారెడ్డి గారి రాజకీయ అంతరంగిక ప్రత్యర్థిన్నీ, రోహిణి కార్తెలో సైతము రెండు చినుకులు కురిపించుచున్న నిత్యదాత అభినవ వరుణ దేవుడున్నూ అయిన మా బొమ్మా శేషరెడ్డి గారికి 32 పండ్లున్నూ ఊడగొట్టారట. అంటే ఊడబెరికారన్న మాట. ఈ ఓపనింగ్ సెర్మని జరిపిన కబీర్‌దాస్ ఏ.సి.సుబ్బారెడ్డి గారికి మా ధన్యవాదాలు.

మరి మేమే గాదు, వేమూరు లక్ష్మయ్య గారు సైతము కోరే చిన్న రిక్వెస్టొకటున్నది. ఆ దారినే మద్రాసు వచ్చి మంగల శాస్త్రి గారి కాంటినెంటల్ సెలూన్‌లో(చూడామణి తాలుకూ) 12 అంగుళాల కంటే పెరగము అని దిఃఖరిస్తున్న నాలుగైదు వెంట్రుకలచేత మేళవింపబడ్డ ఆ దమ్మిల బంధము(వెంట్రుకల ముడి)ను గూడ తీసి వేసి అందమైన బోసి నోటితోడను, చక్కని క్రాఫింగు తోడను, మీసాలను మొదలంట గొరిగిన విశాల ముఖమంటపం తోడను మాకు ప్రత్యక్ష్యం కావలసిందని శేషరెడ్డి గారికి 14 లక్షల మండల ప్రజల పక్షమున విన్నవించుచున్నాము.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

14-7-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### పదేళ్ల నియమం మంత్రులకేనట!

పదేళ్లపాటు అధికారంలో వున్నవారు పదవుల నుంచి వైదొలగి పార్టీ నిర్మాణంలో పాల్గొనాలని లోగడ భావనగర్ కాంగ్రెసు మహాసభ అధ్యక్ష పీఠం నుండి తాను చేసిన సూచన మంత్రి పదవులలో వున్న వారికి మాత్రమే ఉద్దేశించబడిందని వివరిస్తూ, తన సూచనను ఎవ్వరూ అంతగా పట్టించుకోలేదని సంజీవ రెడ్డి గారన్నారు. శాసనసభ్యత్వపు కాలపరిమితి విషయంలో నిర్బంధం ఏమీలేదని, పదేళ్ల గడువు దాటిన వారిని గూడా, ప్రజాశేయస్సు దృష్ట్యా, పార్టీ క్షేమం దృష్ట్యా వారి సభ్యత్వం కొనసాగించడం అత్యవసరమని తోచినచో మరలా అభ్యర్థులుగా నిర్ణయించవచ్చునని కాంగ్రెస్ అధ్యక్షులు స్పష్టీకరించారు.

### చమురు సముద్రాన్ని క్రింద వేసుకొన్న కువైట్!

ఇరాక్ దక్షిణ సరిహద్దులో, పర్షియన్ గల్ఫ్ ఒడ్డున వున్న ఒక చిన్న 'సామ్రాజ్యం' అనుదినం పత్రికలు నింపుతున్న కువైట్. ఈ దేశం క్రింద చమురు సముద్రం వున్నది. ప్రపంచ చమురు నిధులలో నాల్గవ వంతు ఈ చిన్న సామ్రాజ్యంలోనే వున్నదట. ఏటా 50 కోట్ల డాలర్లు అంటే షుమారు 250 కోట్ల రూపాయలు – చమురును ఈ దేశం ఎగుమతి చేస్తుంది. ఈ సామ్రాజ్యానికి చక్రవర్తి 66 ఏండ్ల కుబేరుడు షేక్ సర్‌అబ్దుల్లా. ఇతనిని కలతపరచే సంక్లిష్ట సమస్య వున్న ధనాన్ని ఏమి చేయాలనేది. అప్పటికీ తన దేశీయులందరికీ ఉచిత వైద్య సౌకర్యం కల్గించాడు; ప్రతి విద్యార్థికి ఉచిత విద్య, పుష్టికరమైన భోజనంతోపాటు విదేశాలలో చదివే విద్యార్థులకు స్కాలర్‌షిప్పులిచ్చాడు. నిర్జన ప్రదేశాలకు గూడా చక్కని రోడ్ల నిర్మాణం జరిగింది; కాంక్రీటు గృహంలేని కుటుంబం లేదు. కువైట్‌లో వున్న అధునాతన సుందర భవనాలు క్రిక్కిరిసి వున్నవిగాని, వాటిలో వుండేందుకు చాలినంత మంది జనం లేరు.

# నెల్లూరు ముచ్చట్లు

## రాష్ట్రంలో అత్యధిక ఉష్ణోగ్రత నమోదు!

మళ్లీ ఎండాకాలం వచ్చిందన్నట్లు నెల్లూరులో ఎండలు అదరగొడుతున్నాయి. గత వారం రోజులుగా ఇదే పరిస్థితి కొనసాగుతుంది. 11వ తేది రాష్ట్రంలోని ఏ జిల్లాలో లేనట్లు నెల్లూరులో 40 డిగ్రీల సెంటీగ్రేడు ఉష్ణోగ్రత నమోదయ్యింది. రాత్రి ఉబ్బ సైతం జనాలను నిద్రపోనివ్వడం లేదు.

## చిరుజల్లులతో ప్రయోజనం లేదు!

అదరగొడుతున్న ఎండ నుంచి ఉపశమనం కల్పించడం కోసమన్నట్లు 11వ తేది సాయంత్రం, 12వ తేది రాత్రి పది నిమిషాలపాటు నగరంలోని కొన్ని ప్రాంతాల్లో చిరుజల్లులు కురిసాయి. దానితాలుకు ప్రభావం అన్నట్లు మళ్లీ ఎండ చండ్రప్రచండమయ్యింది. ఈ ఎండల నుంచి జనానికి ఉపశమనమెప్పుడో?

## ఏకాదశే ముందు...

ఏరు ముందా... ఏకాదశి ముందా అనే సామెత జిల్లాలో చాలా రోజులుగా వుంది. ఈ యేడాది ఏకాదశి 11వ తేది వచ్చింది. ఏట్లో మాత్రం చుక్కనీరు లేదు.

## జగన్‌ను తిట్టిన వివేకా

ప్రతినిత్యం ఎవరో ఒకరిపై తిట్ల దండకం చదవనిదేకానీ రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డికి నిద్రరాదు. 10వ తేది వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు. తన స్వార్థం తప్ప మిగతా విషయాలేవీ జగన్‌కు పట్టవు. ఆయన ఎవరి మాట వినడు. జగన్ పార్టీకి కళ్లు, కాళ్లు, చెవులు కూడా లేవు. సహనంలేని జగన్ పార్టీని నడపలేడు. గత అసెంబ్లీ ఎన్నికలకు ముందు చంద్రబాబు ప్రకటించిన ఆల్‌ఫ్రీ పథకాలకు పట్టిన గతే జగన్మోహన్‌రెడ్డికి పదుతుందని మెటికలు విరిచారాయన.

## ట్రాఫిక్‌లో రచ్చ సిఐ!

నెల్లూరు ట్రాఫిక్ దక్షిణ ప్రాంత సిఐగా బొట్టు వెంకటేశ్వర్లుగా పేరుగాంచిన వెంకటేశ్వర్లు నియమితులయ్యారు. నగరంలో ట్రాఫిక్ ఎస్ఐగా, బాలాజీ నగర్ ఎస్ఐగా వెంకటేశ్వర్లు లీలలు నెల్లూరు జనాలు కథలు కథలుగా ఇప్పటికీ చెప్పుకొనే ఘన చరిత్ర ఆయన సొంతం. స్కూటర్లపై వెళ్లే భార్యాభర్తలను 'వీర'లెవల్లో ఆపి గందరగోళాలు సృష్టించిన ఘనుడాయన. బాలాజీనగర్‌లో భాగోతాలు, ట్రంకురోడ్డులో లంచం తీసుకొంటూ ఎసిబికి దొరికిన స్పెషల్ పోలీసు ఆయన. ఇటువంటి వ్యక్తిని పెద్ద మనిషిగా పేరున్న గుంటూరు రేంజ్ ఐజి గుప్తా మళ్లీ ట్రాఫిక్ సిఐగా వేశారు. ఛార్జి తీసుకొన్నాడో లేదో ఉత్తర సిఐ రమేష్‌రెడ్డితో కుర్చీ కోసం గొడవ పడ్డాడు. ఈ పంచాయితీని పరిష్కరించమని ఎస్పీగారు ఎఎస్పీని పురమాయించారు. నగర ట్రాఫిక్‌కు ఇప్పటికున్న అబందర చాలదన్నట్లు వెంకటేశ్వర్లును సిఐగా తెచ్చి వేశారు. ఎస్పీ గారికి ట్రాఫిక్‌ను మించిన తలనొప్పులు వెంకటేశ్వర్లు తేవడం ఖాయం.

## సొంత డబ్బా!

జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డిలకు సహవాస దోషం బాగా అబ్బింది. తమను మించిన ఎమ్మెల్యేలు ఎవరూ లేరని సొంత డబ్బా కొట్టుకొంటున్నారు. నెల్లూరు నగరంలో ప్రతినిత్యం 15 లక్షల నుంచి 20 లక్షల రూపాయలమేర అభివృద్ధి పనులు జరుగుతున్నాయని రాష్ట్రంలో మరెక్కడా జరగని అభివృద్ధి నెల్లూరులో జరుగుతుందని చెప్పారు. 10వ తేది మూడవ డివిజన్‌లోని మారుతీ నగర్ అభివృద్ధి పనులు ప్రారంభోత్సవంలో జంట ఎమ్మెల్యేలు ఈ విధంగా చెబుతూ ప్రతిపక్షాలు తాముచేసిన అభివృద్ధి చూసి ఓర్వలేక విమర్శిస్తున్నాయన్నారు. రోజుకు 20 లక్షలు, నెలకు ఆరు కోట్లు, సంవత్సరానికి 72 కోట్ల రూపాయల పనులు జరిగి కూడా నగరం ఇంత సుందరముదనష్టంగా ఎందుకు వుందో వారిద్దరే సమాధానం చెప్పాలి.

## కలెక్టర్‌కు సిఎం ఫోను

కోట, గూడూరులలోని ప్రభుత్వ సంక్షేమ వసతి గృహాల్లో విద్యార్థులు వేధింపులకు గురైన విషయమై జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డికి ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి ఫోనుచేసి వివరాలడిగారు. పిల్లలపై అఘాయిత్యానికి పాల్పడిన గూడూరు వార్డెన్‌పై కఠిన చర్యలు తీసుకోమని సిఎం కోరగా ఇప్పటికే అతన్ని సస్పెండ్ చేసి కేసు నమోదు చేశామని కలెక్టర్ చెప్పారు. తాను ఆర్డీఓతోపాటు టాస్క్‌ఫోర్సు టీమ్‌లు తరచూ హాస్టళ్లు సందర్శించేలా ఒక కార్యక్రమం రూపొందిస్తానన్నారాయన.

వరుస సంఘటనల నేపథ్యంలోనే 10వ తేదీ కోటలోని గిరిజన బాలికల వసతి గృహంలో శ్లాబ్ పెచ్చులూడి ఇద్దరు విద్యార్థులు గాయపడిన విషయాన్ని తెలుసుకొన్న కలెక్టర్ ఆ రాత్రే హాస్టల్‌ను సందర్శించి పిల్లలకు ధైర్యం చెప్పి వచ్చారు.

## బుజబుజ నెల్లూరులో తాగునీటికి కటకట!

నెల్లూరు నగర శివారు ప్రాంతం బుజబుజ నెల్లూరులో ఇరవై రోజుల కొకసారి తాగునీటి కొళాయిల్లో నీళ్లు వస్తుండడంతో జనం అల్లాడి పోతున్నారు. రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి నియోజకవర్గ పరిధిలోని ప్రాంతమిది. నగరమంతా సమస్యలు పరిష్కరిస్తామని తిరిగే ఆయన శివారు ప్రాంతాలకు ఎందుకు వెళ్లడం లేదో?

## పంచె కట్టిన చంద్రమోహన్!

రూరల్ ఎమ్మెల్యే వివేకానంద రెడ్డిని చూసి స్ఫూర్తి పొందాడేమో జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఫ్యాంటుతో కాకుండా అడ్డ పంచె కట్టులో పార్టీ ఆఫీసుకొచ్చారు. సమైక్యాంధ్ర ఉద్యమానికి మద్దతుగా విలేకరుల సమావేశానికి పంచె కట్టులో వచ్చిన సోమిరెడ్డిని చూసి పాత్రికేయులు ముందు ఆశ్చర్యపోయినా ఆ తర్వాత ఏదో కట్టాలనిపించింది కట్టాన్న ఆయన సమాధానానికి సంతృప్తి పడ్డారు.

## సంగం - హసనాపురం రోడ్డు అధ్వాన్నం!

జిల్లాలో ప్రముఖ పుణ్యక్షేత్రం అనుమసముద్రంపేట దర్గాకు వెళ్లే సంగం - హసనాపురం రోడ్డు అత్యంత అధ్వాన్నంగా వుంది. గుంటలు మిట్టలతో దెబ్బతిని పోయిన ఈ రోడ్డుపై పయనంతోనే దేవుడు కనపడి పోతాడు. ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి నియోజకవర్గంలోనూ ఇంత అధ్వాన్నపు రహదారులుండడం అవమానం కాదా?

## పాస్‌పోర్ట్ అధికారి బదలీ

నెల్లూరు పోలీసాఫీసులో పాస్‌పోర్టు వ్యవహారాలు చూసే మహీధర్ రెడ్డిని చెముదుగుంటలోని పోలీసు శిక్షణా కళాశాలకు బదలీ చేస్తూ గుంటూరు రేంజ్ ఐజి హరీష్‌కుమార్ గుప్తా ఉత్తర్వులిచ్చారు. మహీధర్‌రెడ్డి ఈ సీటులో పదేళ్లుగా పాతుకపోయి వుండడంతో ఈ బదలీ జరిగిందంటున్నారు.

## వెయ్యి మందికి ఓ పోలింగ్ కేంద్రం

గ్రామాల్లో వెయ్యి మంది ఓటర్లకు ఓ పోలింగ్ కేంద్రాన్ని ఏర్పాటు చేయమని ఎన్నికల కమిషన్ ఆదేశించిందని నెల్లూరు ఆర్డీఓ మాధవీలత చెప్పారు. గ్రామాల్లో ఓటర్లు ఎక్కువ, పోలింగ్ కేంద్రాలు తక్కువగా వుండడం వల్ల ఈ నిర్ణయం తీసుకొన్నట్లు చెప్పారు. స్త్రీ, పురుషులకు ఒకే చోట ఓటు హక్కు వుండేలా కూడా ఎన్నికల కమిషన్ నిర్ణయం తీసుకుంది. మంచి నిర్ణయమిది.

## వస్త్ర దుకాణాల బంద్

వస్త్రాలపై ప్రభుత్వం వ్యాట్ ట్యాక్స్ విధింపునకు నిరసనగా జిల్లాలోని 1200 వస్త్ర దుకాణాలు మూతవేశారు. ప్రభుత్వ తీరును గర్హిస్తూ నెల్లూరు, కావలిలో వస్త్ర వ్యాపారులు ప్రదర్శన చేశారు. మొత్తం మీద వస్త్ర వ్యాపారుల బంద్ మూలంగా మూడు కోట్ల రూపాయల వ్యాపారం స్తంభించి పోయింది.

## ట్రెజరీపై ఆంక్షలు

ట్రెజరీలో చెల్లింపులపై ప్రభుత్వం ఆంక్షలు విధించింది. ఉద్యోగులకు జీతాలు మినహా ఇతర బిల్లుల చెల్లింపులు నిలిపివేశారు. ఈ సంవత్సరం పలు దఫాలు ట్రెజరీపై ఆంక్షలు విధించడంతో కాంట్రాక్ట్ సిబ్బంది వేతనాలు, కార్యాలయాల అద్దె, విద్యుత్, టెలిఫోన్ బిల్లులు, వాహనాల అద్దె చెల్లింపులు నిలచి పోతున్నాయి.

## టాస్క్‌ఫోర్సుపై సమీక్ష

జిల్లాలో ప్రభుత్వ సంక్షేమ పథకాలు, అభివృద్ధి కార్యక్రమాల పర్యవేక్షణ కోసం కలెక్టర్ ఏర్పాటుచేసిన టాస్క్ ఫోర్సు అధికారులతో జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ సమీక్ష సమావేశం నిర్వహించారు. టాస్క్‌ఫోర్సు అధికారులకు కేటాయించిన మండలాలు, పర్యవేక్షణ చేసిన కార్యాలయాలు, వసతి గృహాలు, పథకాల తీరు తెన్నుల గూర్చి వివరాలను రాబట్టారు. టాస్క్‌ఫోర్సు అధికారులు అందించిన నివేదికలను జాయింట్ కలెక్టర్ రహస్యంగా వుంచారు.

## లేక్‌వ్యూ కాలనీలో చోరీ

నెల్లూరులో దొంగతనాలు ఆగడం లేదు. పొదలకూరు రోడ్డులోని లేక్‌వ్యూ కాలనీ ఏడో వీధిలో నివాసముండే బిఎస్ఎన్ఎల్ విశ్రాంత ఉద్యోగి కాకాణి ప్రసాద్‌రావు ఇంట్లో లేని విషయం గమనించి తాళాలు పగులగొట్టి బీరువాలోని 21 సవర్ల బంగారు, 11వేల నగదు తీసుకెళ్లారు. ప్రసాదరావు తన సతీమణికి చికిత్స చేయించను చెన్నైకు తీసుకొని వెళ్లడం గమనించి ఈ దొంగతనం చేశారు. యధావిధిగా పోలీసు క్లూ టీమ్, క్రైం పోలీసులు సంఘటనా స్థలాన్ని పరిశీలించి వచ్చారు.

## తెలివిమీరిన దొంగలు

నెల్లూరులో దొంగతనాలు చేస్తున్న దొంగలు బాగా తెలివిమీరి పోయారు. మద్రాస్ బస్టాండ్ దగ్గర వుండే ఎస్వీ టెక్నాలజీస్ దుకాణంలో కంప్యూటర్, పెన్‌డ్రైవ్ కొనడానికి అన్నట్లు పోయి ల్యాప్‌ట్యాప్ కంప్యూటర్‌ను దొంగలించుక వచ్చేశారు. షాపు యజమాని సిసి కెమెరాల్లో నమోదైన ఈ దొంగతనం తాలుకు వివరాలన్నీ సీడీలో నాల్గవ పట్టణ పోలీసులకు అందించారు. చూడాలి దర్యాప్తు ఏ విధంగా చేసి దొంగలను పదుతారో?

సిసి కెమెరాల విషయం తెలియక దొంగలు ఇంత ధైర్యం చేసినట్లున్నారు.

కొరవ 14వ పేజీలో

## జీవప్రదాతకు సజలనయన ప్రణామం!



**20వ తేదికి 18 సంవత్సరాలు గడుస్తాయి - ఈ 18 సంవత్సరాలు పద్దెనిమిది యుగాలుగా కన్పిస్తున్నాయి. తుది శ్వాస విడిచే వరకు పత్రికా సంపాదకత్వమే తన ప్రాణంగా భావించి, పత్రిక భవిష్యత్తు కోసం జీవితం పణంగా పెట్టిన జమీన్‌రైతు జీవప్రదాత నెల్లూరు శ్రీరామమూర్తి గారి ఎడబాటు - ఎన్నేళ్లు గడిచినా దుర్భరంగానే కన్పిస్తున్నది. 18వ వర్ధంతి సందర్భంగా సజల నయనాలతో ఆయన్ను స్మరించుకొంటున్నాము; ప్రణమిల్లు తున్నాము.**

**- జమీన్‌రైతు కుటుంబం**

• ప్రభుత్వ స్కూళ్లలో విద్యార్థులంటే లోకువా?

## పనికిరాని యూనిఫాంలు!

విద్యాభివృద్ధికి విశేష కృషి చేస్తున్నామని, ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థులను ప్రైవేట్ విద్యాసంస్థల్లో చదివే విద్యార్థులకు తీసిపోని రీతిలో తీర్చిదిద్దుతామని, మౌలిక వసతులు కల్పిస్తామని పదే పదే చెప్పడం ప్రభుత్వానికి అలవాటు. నిజానికి విద్యార్థులకు అందించే పాఠ్య పుస్తకాల దగ్గర్నుంచి యూనిఫాంల వరకు అన్నింటిలో నిర్లక్ష్యం కొట్టొచ్చినట్లు కన్పడుతోంది. ప్రభుత్వ పాఠశాలల్లో ఒకటవ తరగతి నుంచి ఐదవ తరగతి వరకు చదివే విద్యార్థిని విద్యార్థులందరికీ ఈ ఏడాది ప్రభుత్వమే ఉచితంగా యూనిఫాంలను అందజేస్తోంది. పిల్లల సంఖ్యకు తగినట్లు వీటిని అందజేయకుండా కొద్ది మందికి మాత్రమే సరఫరా చేయడం, దీనికోసం వాడిన బట్ట పరమ నాసిరకంగా వుండడంతోపాటు సైజులు సక్రమంగా లేకపోవడంతో విద్యార్థినీ విద్యార్థులు పడుతున్న అవస్థలు అన్నీ ఇన్నీ కావు. పొట్టి నిక్కరు, పొడుగు చొక్కా, బాలికలకైతే అసలు పట్టని దుస్తులు సరఫరా జరగడంతో అవి పిల్లలకు ఉపయోగపడకుండా పోతున్నాయి. హైదరాబాద్‌కు చెందిన నేషనల్ స్మాల్ స్కేల్ ఇండస్ట్రీ నుంచి ఈ యూనిఫాం పిల్లలకు సరఫరా అవుతుంది. ఒక్కో


చిట్టిపొట్టి దుస్తులు.

జతకు 200 రూపాయలు ప్రభుత్వం చెల్లిస్తోంది. ఆ మొత్తాన్ని పిల్లల సంఖ్యకు తగినట్లు ఆయా పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు పంపితే వారు ఆ కంపెనీకి డిడి తీసి పంపిస్తున్నారు. పాఠ్యపుస్తకాల తరహాలోనే అరకొరగా దుస్తులు అందడంతో చాలా ప్రాంతాల్లో వివాదాలు తలెత్తుతున్నాయి. మా పిల్లలకు ఎందుకు ఇవ్వలేదని విద్యార్థుల తల్లి తండ్రులు గొడవకు దిగుతున్నారని వారికి సమాధానం చెప్పలేక పోతున్నామని పలువురు ఉపాధ్యాయులు వాపోతున్నారు. జత 70 రూపాయలు కూడా చేయనంత పరమ నాసిరకంగా వుండి వాటికి అధికంగా ధర చెల్లించడంతో ఆంతర్యం ఏమిటో అంతు పట్టడం లేదు. మొత్తం మీద యూనిఫాంల సరఫరా అస్తవ్యస్తంగా మారింది.

## నెల్లూరులో పెద్ద సమస్య ట్రాఫిక్కే!

సరిదిద్దే చర్యలు చేపట్టాల్సిందే!

నెల్లూరు నగరం ట్రాఫిక్ చక్రబంధంలో చిక్కుకొని విలవిల్లాడుతోంది. పెరిగిన జనాభాకు తోడు వాహనాల వినియోగం కూడా పెరిగింది. దీనికి తగినట్లు రోడ్లు విశాలంగా లేకపోవడం, రోడ్ల విస్తరణ జరిగినా సక్రమంగా లేకపోవడంతో రోజురోజుకు ట్రాఫిక్ అధికమవుతోంది. దీనికితోడు ఇష్టానుసారంగా వెలుస్తున్న బహుళ అంతస్తుల భవనాలు. నగరంలో ఏ మూల చూసినా ట్రాఫిక్ చిక్కుముళ్లే. ప్రధాన రహదారి మొదలు చిన్నాచితకా రోడ్లలో సైతం ట్రాఫిక్ సమస్య తలెత్తుతోంది. షాపింగ్‌మాల్‌లు కట్టినా పార్కింగ్ స్థలం చూపకపోవడంతో మెయిన్‌రోడ్డుపైనే వాహనాలు నిలపాల్సి రావడంతో విఆర్‌సి, పొగతోట, గాంధీబొమ్మ, ట్రంకురోడ్డు, ఎసి సెంటర్ తదితర ప్రాంతాలలో ట్రాఫిక్ సమస్య తీవ్రమవుతోంది. కాపువీధి, చిన్నబజార్, పెద్దబజార్, పోస్టాఫీసు వీధులలో ట్రాఫిక్ సమస్య జటిలంగా వుంటోంది. రోడ్లు వెడల్పుచేసే కార్యక్రమాన్ని ప్రణాళికా బద్ధంగా నిర్వహించకపోవడం, వున్న రోడ్లలో ఐ ల్యాండ్‌ల పేరుతో అధిక స్థలాన్ని వృధా చేయడంతో రోడ్లు వాహనాలతో క్రిక్కిరిసి పోతున్నాయి. ప్రధాన రహదారులతో పాటు రామలింగాపురం అండర్ బ్రిడ్జి వైపు నుంచి మూడు హోళ్లకు వచ్చే రోడ్డు గతంలో ఎన్నడూలేని విధంగా రద్దీగా వుంటోంది. దీనికి కారణం ఆటోలు తదితర వాహనాలను అడ్డదిడ్డంగా నిలుపుదల చేయడం. స్వతంత్ర పార్కు రోడ్డులో సైతం ఇదే పరిస్థితి. పొగతోట నుంచి సండేమార్కెట్, సుబ్రహ్మణ్య స్వామి గుడి మీదుగా వెళ్లే రోడ్డులో నిత్యం ట్రాఫిక్ స్తంభించి పోతోంది. ఇక్కడ కట్టిన బహుళ అంతస్తుల భవనాలకు పార్కింగ్ స్థలాన్ని వదలకపోవడం, షాపింగ్‌కు వచ్చే వాళ్లు నానాపాట్లు పడుతున్నారు.


ట్రంకురోడ్డులో నిత్యం ఇదే పరిస్థితి.

## టూటౌన్ ఎస్ఐ గులాం గిరి

• కానిస్టేబుల్‌ను కొడితే అడిగే దిక్కులేదు



నిత్యం వార్తల్లో టుటౌన్ పోలీస్‌స్టేషన్.

నెల్లూరు నగరంలో వివిధ స్టేషన్ల ఎస్ఐలు వ్యవహరిస్తున్న తీరు వివాదాస్పదమౌతోంది. ప్రజాప్రతినిధుల మోచేతి నీళ్లు తాగడానికి అలవాటుపడిన కొందరు ఎస్ఐలు ప్రజలకు రక్షణ కల్పించడం మాట అటుంచి కానిస్టేబుళ్లను బయటివారు కొడితే రాజీ మంత్రం పఠిస్తుండడం వారి అసమర్థతను తెలియజేస్తోంది. రెండవ పట్టణ ఎస్ఐ మారుతీకృష్ణ వ్యవహారం ఇందుకు నిదర్శనం. శాంతి భద్రతలను కాపాడడం, ప్రజలకు రక్షణ కల్పించడం అనే బాధ్యతను మరచిన ఆయన సెటిల్‌మెంట్లు చేయడం, నేతలు చెప్పిన వారిపై కేసులు పెట్టడం, వదిలేయమంటే జీ హుజూర్ అంటూ విడిచి పెట్టడమే ఎస్ఐ గారి పని. పోలీస్ యూనిఫాం అంటేనే మరచిపోయేంతగా ఇతర వ్యాపకాల్లో తల మునకలై వుండే ఆయన తన స్టేషన్‌లో పనిచేసే కానిస్టేబుళ్లను కొందరు అల్లరి మూకలు, ఆనం అనుచరులుగా చెప్పుకొనే రౌడీలు కొడితే అడిగే దిక్కు లేకుండా పోయింది. వారి చేతుల్లో దెబ్బలుతిన్న పోలీసులు ఎస్ఐ వద్దకు వచ్చి కేసు పెట్టమని చెప్తే వారిని కొట్టిన వారిని తీసుకవచ్చి మరోసారి పోలీసులపై చేయి వెయ్యడానికి భయపడేలా చేయాల్సింది పోయి దెబ్బలు తిన్న పోలీసుపైనే ఆగ్రహించాడట. ఎంత చెప్పినా అల్లరి మూకలపై కేసులు పెట్టడానికి ఒప్పుకోని ఎస్ఐ ప్రజాప్రతినిధి నుంచి వచ్చిన ఫోన్‌తో వారితో రాజీకి రండి అని చెప్పడంతో కానిస్టేబుళ్లకు దిమ్మతిరిగి పోయింది. చివరకు పోలీస్ అసోసియేషన్ నేతలు సైతం ఎస్ఐ వద్దకుపోయి ఇదేమిటని ప్రశ్నిస్తే వారికీ తలపొగరుగా జవాబిచ్చాడట. ఎస్పీ జోక్యం చేసుకొని ఇలాంటి వారిని గాడిలో పెట్టకపోతే పోలీస్ పరువు పోవడం ఖాయం.

• చింతా దెబ్బకు

## హడలుతున్న అధికారులు!

తిరుపతి పార్లమెంటు సభ్యుడు చింతా మోహన్ ఇటీవల మండలస్థాయి అధికారులతో సమీక్షా సమావేశాలు నిర్వహించి ప్రధానంగా సంక్షేమ, అభివృద్ధి పథకాలపై దృష్టి సారించి అధికారులపై ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు. పార్లమెంటు నియోజకవర్గ పరిధిలో వున్న తోటపల్లి గూడూరు మండలంలో ఇటీవల సమీక్ష సమావేశం నిర్వహించడం జరిగింది. ఈ సమావేశానికి హాజరైన అధికారులను శాఖలవారీగా చేపడుతున్న కార్యక్రమాలపై ఆరా తీశారు. ఎమ్పీ వేసిన


తిరుపతి ఎమ్పీ చింతా మోహన్.

ప్రశ్నలకు సరైన సమాధానం చెప్పలేక కొందరు అధికారులు నీళ్ల నమలాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఉపాధి హామీ పథకం, బ్యాంకు లింకేజి రుణాలు, ఇందిరమ్మ గృహాల నిర్మాణం, అంగన్‌వాడీ కేంద్రాల పనితీరు, త్రాగునీటి సరఫరా తదితర సమస్యలపై వివరాలను రాబట్టారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఏ ఉద్దేశంతో పథకాలు అమలు చేస్తుంది? అన్న ప్రశ్నకు అధికారుల వైపు నుంచి సమాధానం రాలేదు. అంగన్‌వాడీ కేంద్రాల లక్ష్యం ఏమిటని ఆ శాఖ సూపర్‌వైజర్ మంజులను ప్రశ్నిస్తే మౌనంగా వుండి పోయింది. దీంతో చింతాకు చిర్రెత్తుకొచ్చింది.

## వలసల నివారణకు కృషి

ఉపాధి హామీతో సాయం

జిల్లాలోని మెట్టప్రాంత మండలాల ప్రజలు జీవనోపాధికి ఇతర ప్రాంతాలకు వలసలు వెళ్లకుండా నియంత్రించి వారికి ఉపాధి అవకాశాలు కల్పించేందుకు అధికారులు నడుం బిగించారు. వారికి జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం ద్వారా కూలి పనులు కల్పించేందుకు ప్రణాళిక రూపొందిస్తున్నారు. కూలీలకు అవసరమైన పనులు అప్పగించి త్వరితగతిన పూర్తి చేసేందుకు చర్యలు తీసుకొంటున్నారు. ప్రధానంగా వలసలను నివారించే దిశగా కృషి చేయాలని జిల్లా కలెక్టర్ మండలస్థాయి అధికారులను ఆదేశించడం జరిగింది. ఇటీవల ఎంపిడిఓ, ఎపిఓలతో సమీక్షా సమావేశం ఏర్పాటు చేశారు. పనులు జరిగిన వెంటనే కూలీలకు వేతనాలు చెల్లించాలని లేని పక్షంలో సంబంధిత ఎపిఓలపై కఠిన చర్యలు తీసుకోవడం జరుగుతుందని సున్నితంగా హెచ్చరికలు చేశారు. అలాగే ఉపాధి హామీ పథకం అమలులో అవినీతి, అక్రమాలకు పాల్పడిన వారిపై చర్యలు తీసుకోవాలన్నారు. పెన్నా డెల్టా కింద వరిసాగు చేయడంతో కొంతమేర ఉపాధి పనులకు ఆటంకం ఏర్పడింది. దీంతో మెట్ట ప్రాంతాలపై అధికారులు దృష్టి సారించారు.

• గ్రామాల్లో

## పారిశుద్ధ్యం మెరుగుకు నిధులు

పరిస్థితులు మారేనా?

గ్రామీణ ప్రాంతాల్లో అంటు వ్యాధులు, డెంగ్యూ, మలేరియా తదితర విషజ్వరాలు ప్రబలకుండా అవసరమైన నిధులు కేటాయించింది ప్రభుత్వం. నేషనల్ రూరల్ హెల్త్‌మిషన్ కింద గ్రామానికి పదివేల రూపాయలు, పిహెచ్‌సికి 1.75 లక్షలు కేటాయించారు. ఈ నిధులతో పారిశుద్ధ్య కార్యక్రమాలు నిర్వహించడంతోపాటు ప్రజలకు పూర్తి అవగాహన కల్పించాల్సి వుంటుంది. గ్రామ పంచాయితీ సర్పంచ్, విఆర్వోలు సమన్వయంతో పారిశుద్ధ్య కార్యక్రమాలను అమలు చేయాలని ప్రభుత్వం పేర్కొంది. నిధులు కేటాయిస్తున్న ప్రభుత్వం పర్యవేక్షణ చేయించక పోవడంతో కొన్ని గ్రామాల్లో ఎటువంటి కార్యక్రమాలు చేపట్టడం లేదు. ఇకపోతే ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల పరిస్థితి మరింత దారుణంగా వుంటుంది. ఎన్.ఆర్.ఎం కింద విడుదల కాబడిన నిధులను ఇతర అవసరాలకు కొంత భాగం వినియోగించి, మిగిలిన నిధులను స్వాహా చేస్తుంటారన్న ఆరోపణలున్నాయి. వైద్య ఆరోగ్య శాఖ అధికారులు నిధులు విడుదల చేసి చేతులు దులుపుకోకుండా పర్యవేక్షణ చేస్తే ఫలితాలు సాధించవచ్చు.

# జాతీయ రహదారి విస్తరణ జరిగేనా?




ప్రస్తుతం వున్న నాలుగులైన్ల జాతీయ రహదారిని ఆరు లైన్లుగా విస్తరించాలని కేంద్రం నిర్ణయించింది. ఇందుకోసం గత సంవత్సరం నుంచి సర్వే కార్యక్రమం జరుగుతోంది. నాలుగులైన్ల స్థానంలోనే మరో రెండు లైన్లను ఏర్పాటుచేసే విధంగా ప్రణాళిక రూపొందించారు. నేషనల్ హైవే ఆథారిటీ ఆఫ్ ఇండియా ఆధ్వర్యంలో నిర్మాణ పనులు చేపట్టాల్సి వుంది. మన జిల్లాలో తడ నుంచి కావలి వరకు జాతీయ రహదారి వుంది. మరో రెండు లైన్ల రహదారి ఏర్పాటు కోసం అవసరమైన భూసేకరణ త్వరితగతిన పూర్తి చేయాలని రెవెన్యూ యంత్రాంగాన్ని ఆదేశించినా సర్వే ప్రక్రియ పూర్తి కావడం లేదు.

జాతీయ రహదారిపై వెళ్లే భారీ వాహనాల సంఖ్య రోజురోజుకు అధికమవుతుంది. జాతీయ రహదారిపై ఏదైనా ప్రమాదం సంభవించినప్పుడు గంటల తరబడి వాహనాల రాకపోకలు స్తంభించిపోతున్నాయి. వీటిని దృష్టిలో వుంచుకొని మరో రెండు లైన్లను ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. భూసేకరణకు అవసరమైన నిధులున్నప్పటికి సర్వే కార్యక్రమం పూర్తి కాకపోవడంతో ఖర్చు చేయలేని పరిస్థితి ఏర్పడింది. కావలి నుంచి గౌరవరం వరకు కొంతమేర రోడ్డు విస్తరణ పనులు చేపట్టారు. గత నెల రోజుల నుంచి ఈ పనులు కూడా తాత్కాలికంగా నిలిపివేశారు. తడ నుండి నెల్లూరు వరకు ఇప్పటికీ పనులు ప్రారంభించలేదు.

## సర్వేయర్ల కొరత

ఆరులైన్ల రహదారి పనులకు అవసరమైన భూసేకరణ చేసేందుకు సర్వేయర్ల కొరత ఏర్పడింది. రెవెన్యూ అధికారులకు ముందుగా సర్వేయర్లను నియమించాలని సంబంధిత అధికారులు కోరినప్పటికి సకాలంలో నియమించలేకపోతున్నారు. తొలుత జాతీయ రహదారి ప్రక్కన ప్రభుత్వ పోరంబోకు, అసైన్‌మెంటు భూములు వున్నాయా? లేదా? అని నిర్ణయించి ఆ తర్వాత రైతులకు చెందిన పట్టాభూముల్ని సేకరించాల్సి వుంది.

ఆరులైన్లుగా విస్తరణ జరిగితే మనుబోలు, వెంకటాచలం, కాకుటూరు, తడ, బుజబుజ నెల్లూరు ప్రాంతాలు కొంతభాగం ఖాళీ చేయాల్సి వుంటుంది. ఈ ప్రాంతంలోని ప్రజలకు నష్టపరిహారం చెల్లిస్తామని చెబుతున్నా వారు అందుకు అంగీకరించడం లేదు. అవసరమైతే కోర్టుకైనా వెళ్లేందుకు సిద్ధమని చెబుతున్నారు. బుజబుజ నెల్లూరుకు సమీపంలో వున్న చెరువును పూడ్చి రహదారి నిర్మాణం చేపట్టాలని కోరుతున్నారు. ఇలా చేయడం వలన కొంతమేరకే ఇళ్లు ఖాళీ అవుతాయి. గతంలో నిర్మించిన జాతీయ రహదారి కారణంగా భూములు, ఇళ్లు కోల్పోయిన వారికి పూర్తిస్థాయిలో పరిహారం అందలేదన్న విషయాన్ని గుర్తు చేస్తున్నారు.

జిల్లా జాయింట్ కలెక్టర్ తరచూ సమీక్షా సమావేశం ఏర్పాటు చేసి ఆరులైన్ల జాతీయ రహదారి ఏర్పాటుకు భూసేకరణ పూర్తి చేయాలని ఆదేశిస్తున్నా అధికారుల్లో మాత్రం స్పందన కానరావడం లేదు. ప్రమాదాల నివారణతోపాటు వాహనాలు సులభంగా గమ్యం చేరాలన్న లక్ష్యం ఎప్పటికి నెరవేరుతుందో వేచి చూడాలి. నేషనల్ హైవే అథారిటీ ఆఫ్ ఇండియా అధికారులకు భూములు అప్పగిస్తే గాని పనులు ప్రారంభించేందుకు వీలుపడదు. ◆J

● స్వయంకృషితో ఎదిగిన

# చెరుకుపల్లి పిచ్చిరెడ్డి!

కృషి వుంటే మనుషులు ఋషులవుతారు... మహాపురుషులవుతారన్న కవి వాక్కులు అచ్చుగుద్దినట్లు చెరుకుపల్లి పిచ్చిరెడ్డికి సరిపోతాయి. మెట్ట మండలమైన కనిగిరి తాలూకా నల్లమడగల గ్రామంలోని రైతు కుటుంబీకులు వెంకారెడ్డి, నారాయణమ్మ దంపతులకు జన్మించిన పిచ్చిరెడ్డి కష్టాన్ని నమ్ముకొని పైకి వచ్చారు. 1949లో నెల్లూరు నగరంలో ఏదైనా వ్యాపారం చేద్దామని కాలిడిన ఆయన ఢక్కామొక్కీలు తిన్నారు. మల్లిఖార్జున ఫైనాన్స్‌తో ఆయన వ్యాపార ప్రస్థానం మొదలయ్యింది. ఆ తర్వాత ట్రంకురోడ్డులో శివప్రియ హోటల్‌ను పెట్టి దాన్ని అందరికీ అందుబాటులో వుండేలా చేసి మంచి పేరు తెచ్చుకొన్నారు. దీంతోనే సరిపెట్టుకోకుండా పది మందికి జీవనోపాధి కల్పించాలని తన పేరు నెల్లూరు చరిత్రలో కలకాలం నిలిచిపోవాలని మదిలో మెదిలిన ఆలోచనతో ఆయన కట్టిన కళ్యాణ మండపమే సిపిఆర్. తన పేరు చెరుకుపల్లి పిచ్చిరెడ్డితోనే దాన్ని కట్టారాయన. నెల్లూరులో తొలి ఎసి కళ్యాణ మండపమది. విశాలమైన వేదిక. 1200 మంది అతిథులు కూర్చొనే వసతి. పెద్ద డైనింగ్ హాల్, ఓపెన్ డిన్నర్‌లకు ప్రత్యేక వసతులతో కమనీయంగా 1100 మందికిపైగా జంటలు పెళ్లిళ్ల ద్వారా ఈ కళ్యాణ మండపంలో ఒకటయ్యారు. ఇప్పటికి నగరంలో ఎన్నో కళ్యాణ మండపాలు కట్టినా చాలా మంది సిపిఆర్ కళ్యాణ మండపంలోనే తమ బిడ్డల పెళ్లిళ్లు జరగాలని కోరుకొంటూరు.

స్వయం కృషితో పైకెదిగిన చెరుకుపల్లి పిచ్చిరెడ్డిని గుర్తించి హరివిల్లు క్రియేషన్స్ 16తేది టౌన్ హాల్‌లో 'లైఫ్ టైమ్' అచీవ్‌మెంట్ అవార్డుతో సత్కరించడం శ్రమను నమ్ముకొన్నవారందరికీ జరిగే సత్కారంగా భావించవచ్చు.

# దాతృత్వంలో ఆదిశేషారెడ్డి ఆదర్శం

## ఎమ్పీ చింతామోహన్ ప్రశంస!

అల్లూరు ఆదిశేషారెడ్డి రజతోత్సవ క్రీడా పోటీలు గూడూరు ఆదిశేషారెడ్డి స్టేడియంలో ఇటీవల అట్ట హాసంగా జరిగాయి. ఆదిశేషారెడ్డి జన్మదినోత్సవాన్ని పురస్క రించుకొని ప్రతి ఏటా రోటరీక్లబ్ స్పోర్ట్స్‌మీట్ నిర్వహించడం ఆనవాయితి. ఈ ఏడాది ఈ కార్యక్రమానికి తిరుపతి ఎంపి చింతామోహన్ ముఖ్యఅతిధిగా విచ్చేసి పోటీలను ప్రారంభిం చారు. ఆయన మాట్లాడుతూ దాతృత్వంలో ఆదిశేషారెడ్డి అం దరికి ఆదర్శం అన్నారు. ఎందరో పేద విద్యార్థులకు స్కాలర్ షిప్పులు అందజేస్తూ వారి అభ్యున్నతికి పాటుపడుతున్న వ్యక్తని ప్రశంసించారు. గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ మాట్లాడుతూ ఇలాంటి కార్యక్రమాలు క్రీడాభివృద్ధికి దోహదం చేస్తాయన్నారు. స్టేడియం అభివృద్ధికి తనవంతు సహకారం అందిస్తామన్నారు. వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ నేత ఎల్లసిరి గోపాల రెడ్డి మాట్లాడుతూ క్రీడలంటే ఆదిశేషారెడ్డి గుర్తుకు వస్తారని అంతగా క్రీడలను ఆయన ప్రోత్సహిస్తున్నారని అంటూ ఆయన తరహాలోనే అల్లుడు ఆర్‌జికెరెడ్డి తోడ్పడాలన్నారు. రెండు రోజులపాటు జరిగిన ఈ పోటీల్లో విజేతలకు బహుమతులను డిఎస్పీ నారాయణరెడ్డి అందజేశారు. అలాగే దొడ్ల రుక్మిణమ్మ రోటరీ స్కాలర్‌షిప్పుల్లో భాగంగా 11మంది విద్యార్థులకు 40వేల రూపాయలను అందజేశారు.


క్రీడా జ్యోతిని వెలిగిస్తున్న తిరుపతి ఎమ్పీ చింతామోహన్.


మాజీ ముఖ్యమంత్రి రోశయ్య జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని హైదరాబాద్‌లో ఆయన్ను సన్మానిస్తున్న నెల్లూరు ఆర్యవైశ్య నేతలు కెవి.చలమయ్య, అమరా శ్రీరాములుశెట్టి.


ముస్లిం విద్యార్థులు బిసి-ఇ సర్టిఫికేటు పొందేందుకు నెల్లూరులోని స్టూడెంట్స్ ఇస్లామిక్ ఆర్గనైజేషన్ ఆఫ్ ఇండియా సంస్థ తరపున అవగాహన కల్పిస్తున్న అబ్దుల్‌సమీ, నసీర్ సాహెబ్.

## నిమ్మధరలు పతనం — రైతుల లబోదిబో

జిల్లాలో నిమ్మకాయల ధరలు పడిపోవడంతో రైతులు దిగాలుపడుతున్నారు. వారం రోజుల క్రితం వరకు 2వేల రూపాయలు వుండిన బస్తా ధర నేడు 500 రూపాయలకు పడిపోయింది. వాతావరణ పరిస్థితులు అనుకూలంగా లేకపోవ డంతో నిమ్మ కాపు తగ్గింది. గత ఏడాది విరివిగా వున్న నిమ్మ ఈ సంవత్సరం తగ్గిపో యింది. దీనికి తోడు ధరలు పడిపోయాయి. ఇతర రాష్ట్రాలకు అధికంగా సరఫరా అవు తున్న నిమ్మ ఈ ఏడాది చాలా వరకు తగ్గడంతో ఈ పరిస్థితి ఏర్పడిందని వ్యాపారులు అభిప్రాయపడుతున్నారు. దీంతో రైతులు తెచ్చిన కాయలను వ్యాపారులు మార్కెట్ లేదనే నెపంతో కొనడం లేదు. వర్షాలు రాకమునుపే నిమ్మకాయల ధరలు అంతగా పతనం కావడం, మార్కెట్ లేకపోవడం అటు వ్యాపారులు, ఇటు రైతులను కుంగదీస్తుంది.

## నిరుపయోగంగా చెత్త వ్యాన్లు!

### జడ్పీ ఛైర్మన్ కృషి బూడిద పాలు

పంచాయితీల్లో చెత్తను తరలించేందుకు జిల్లాపరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఏర్పాటుచేసిన టాటావ్యానులు కలువాయి మండలంలో నిరుపయో గంగా మారాయి. ఉదాత్త ఆశయంతో జడ్పీఛైర్మన్ జిల్లాలోని అన్ని మేజర్ పంచాయితీ లకు చెత్తను తరలించేందుకు టాటాఏస్ వ్యానులను సమకూర్చారు. జడ్పీ నిధులతో చేప ట్టిన ఈ కార్యక్రమం వల్ల ఇటు పంచాయితీ సిబ్బందికి సౌలభ్యంగా వుండడమే కాక, అటు గ్రామాల్లో పారిశుధ్య నిర్మూలనకు ఎంతగానో తోడ్పడేది. పంచాయితీల్లో చెత్తను తొలగి స్తున్న ఈ వాహనాలను చూసి జనం ఎంతగానో సంతోషించి జడ్పీ ఛైర్మన్‌ను మెచ్చుకొ న్నారు. కానీ ఆ సంతోషం ఎంతోసేపు నిలువకుండాపోయింది. వీటిని మొదట్లో తిప్పినా తర్వాత మూలనపెట్టేశారు. వినియోగించకపోవడంతో ఆ వాహనాలు కాస్త మరమ్మత్తు లకు గురయ్యాయి. పని చేస్తున్న సిబ్బందికి జీతాలు చెల్లించలేని పరిస్థితి నెలకొనింది. చివరకు డ్రైవర్‌ను పెట్టుకొనే స్థోమత లేదన్నట్లు ప్రక్కన పెట్టడంతో కోట్ల రూపాయలు వెచ్చించి చేపట్టిన కార్యక్రమం బూడిదలో పోసిన పన్నీరైంది. అధికారులు జోక్యం చేసు కొని వాహనాలను తిరిగి వినియోగంలోకి తేవాలని మండల ప్రజలు కోరుకొంటున్నారు.

● కలువాయిలో

## నాయకుడేడి?

కలువాయి మండలంలో వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీని ముందుండి నడిపించే నాయకుడు కరు వయ్యాడు. కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల్లో ఐక్యత కొర వడడం, ఎవరికి వారుగా గ్రూపులు కట్టడంతో విసిగి వేసారిన ప్రజలు వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ వైపు ఆకర్షితు లవుతున్నారు. ప్రజల్లో ఆ పార్టీ పట్ల అభిమానం మెండుగా కన్పిస్తున్నా దానిని పార్టీని బలోపేతం చేసేందుకు చక్కగా వినియోగించుకొనే నాయకత్వం లేకుండా పోయింది. జగన్ ఓదార్పు యాత్రలో ఇక్కడి నాయకులు అట్టహాసంగా పాల్గొ న్నప్పటికీ మారిన రాజకీయ సమీకరణల్లో ఎటూ తేల్చుకో

### వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌కు నాయకత్వ సమస్య

లేక మీమాంసలో వుండడంతో పార్టీ చుక్కాని లేని నావ అయ్యింది. అభిమానులు, కార్యకర్తలు, ప్రజలు జగన్‌వైపు వెళ్లాలని ఒత్తిడి చేస్తున్నా భవిష్యత్తు ఎలా వుంటుందనే దానిపై ఒక నిర్ణయానికి రాలేక సందిగ్దంలో వున్నారు నేతలు. ఆ పార్టీ సభ్యత్వ నమోదు కార్యక్రమం జిల్లా వ్యాప్తంగా జరుగుతున్నా కలువాయి మండలంలో ఆ ఊసేలేదు. అడపాదడపా జైజగన్ అంటుండడమే తప్ప ముందుండి పార్టీని నడిపించేవారు లేకపోవడంతో మండ లంలో పార్టీకి దిక్కులేకుండా పోయింది.

## కరెంటు లేని కాలనీ

బోగోలు మండలం కడనూతల పంచాయితీలో గల బిసి కాలని వాసుల పరిస్థితి అధ్వా న్నంగా వుంది. రోజురోజుకు సాంకేతిక పరిజ్ఞానం కొత్త పుంతలు తొక్కుతున్న తరుణంలో ఇక్కడి వారికి విద్యుత్ సౌకర్యం కలగా మారింది. ఈ కాలనీని మూడు సంవత్స రాల క్రిందట నిర్మించారు. అప్పటి నుంచి ఇంతవరకు అక్కడి కుటుంబాల వారు కరెంటు సౌకర్యానికి నోచుకో లేదు. కరెంటు స్తంభాలు మాత్రం వేసివున్నారు తప్ప విద్యుత్ వైర్లు గాని, కనెక్షన్ గాని లేదు. కాలని ఏర్పడిన నాటి నుంచి

### కడనూతలలో వుంది

గత మూడేళ్లుగా ఈ ప్రాంత ప్రజలు అధికారుల చుట్టూ తిరుగుతున్నా విద్యుత్ శాఖకు మాత్రం చీమకుట్టినట్లుగా లేకపోవడంతో ప్రపంచమంతా అధునాతన సౌకర్యాలను అందిపుచ్చుకొంటుంటే బిసి కాలని వాసులు మాత్రం చీకట్లో కాలం గడపాల్సిన దీన పరిస్థితి. ఈ సమస్యను చివరకు స్థానిక ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు దృష్టికి తీసు కెళితే ఆయన విద్యుత్ సౌకర్యానికి అయ్యే ఖర్చు తాను భరి స్తానని చెప్పినా అధికారుల్లో చలనం లేకపోవడం పట్ల స్థాని కులు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు.

## సౌత్ ఆములూరులో లగడపాటి!

### చిన్ననాటి జ్ఞాపకాలలో ఎమ్పీ

విజయవాడ ఎంపి లగడపాటి రాజగోపాల్, సర్వే పల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డితో కలిసి తోటపల్లి గూడూరు మండలం సౌత్ ఆములూరు గ్రామానికి విచ్చేశారు. ల్యాంకో సంస్థల ఆధ్వర్యంలో ఏర్పాటు చేసిన మిన రల్ వాటర్ ప్లాంటును ప్రారంభించేందుకు వచ్చిన ఆయన ఆ ఊరితో గల అనుబంధాన్ని గుర్తు చేసుకొన్నారు. రాజగోపాల్ అమ్మమ్మ ఊరు ఆములూరు కావడంతో ఆయన తండ్రి రామానాయుడిని వెంటపెట్టుకొని వచ్చాడు. గ్రామస్తులు ఆయ నకు ఘనస్వాగతం పలికారు. చిన్ననాడు తాను గ్రామానికి వచ్చిన స్మృతులను నెమరువేసుకొన్నారు. సంపాదనే ధ్యేయం కాదని తన కుటుంబీకులు, తాను తిరిగిన, అనుబంధం పెన వేసుకొన్న గ్రామాలలో ప్రజాహిత కార్యక్రమాలు చేపట్టాలన్నదే తన అభిమతమన్నారు. అందుకోసమే చేజర్ల మండలం పెరు మాళ్లపాడులోను, ఆములూరులోను వాటర్‌ప్లాంట్, బస్‌షెల్టర్ నిర్మిస్తున్నట్లు తెలిపారు. పొట్టిశ్రీరాములు స్ఫూర్తితో సమై క్యాంధ్రకే కట్టుబడి వున్నానని స్పష్టం చేశారు. ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి మాట్లాడుతూ ల్యాంకో స్ఫూర్తితో ఈ ప్రాంతానికి చెందిన పారిశ్రామికవేత్తలు ముందుకొచ్చి గ్రామాలు అభివృద్ధి చేయాలన్నారు. లగడపాటి సేవలను విజయడైరీ మాజీ ఛైర్మన్ ముప్పవరపు గోపాలకృష్ణ చౌదరి, కాంగ్రెస్ నేతలు దిలీప్‌రెడ్డి, దశరధరామిరెడ్డి, డిస్ట్రిబ్యూటరీ ఛైర్మన్ సురేంద్రరెడ్డి కొని యాడారు. ఈ కార్యక్రమంలో స్థానిక నేతలు మద్దిన గోపాల్ నాయుడు, చావా కోటయ్యానాయుడు, గూడ్లూరు వెంకయ్య నాయుడు తదితరులు పాల్గొన్నారు.

# రేమాల వెంకారెడ్డికి ఘనసత్కారం

**కావలి అంతా తరలి వచ్చింది**



వెంకారెడ్డిని సత్కరిస్తున్న కేతిరెడ్డి రామకోటారెడ్డి.

రైతు పక్షపాతిగా, వ్యాయామ గురువుగా, సేవాతత్పరునిగా పేరుగాంచిన కావలి ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం అధ్యక్షుడు రేమాల వెంకారెడ్డికి ఆత్మీయ సన్మాన కార్యక్రమం జూలై 3తేది కావలి పట్టణం షాదీ మంజిల్‌లో ఘనంగా జరిగింది. వెంకారెడ్డి 83వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని సమైక్య మిత్రమండలి ఆధ్వర్యంలో జరిగిన ఈ సన్మాన కార్యక్రమానికి ప్రముఖ వైద్యుడు డాక్టర్ ప్రభాకర్ నాయుడు అధ్యక్షత వహించారు. ఆయన మాట్లాడుతూ సహకారసంఘం అధ్యక్షునిగా నీతి నిజాయితీలతో కొనసాగుతూ రైతులకు ప్రభుత్వపరంగా విడుదలైన రుణాలు, ఎరువులను సక్రమంగా పంపిణీ చేశారని కొనియాడారు. గడచిన 22సంవత్సరాలుగా రైతులకు సహకారం అందించడమేకాక, వ్యాయామ గురువుగా ఎంతో మందిని తీర్చిదిద్దారన్నారు. ఆయన ఆధ్వర్యంలో ఎన్నో కుస్తీ పోటీలు జరిగిన విషయాన్ని ఈ సందర్భంగా వక్తలు గుర్తు చేసుకొన్నారు. మాజీ మున్సిపల్ ఛైర్మన్లు శ్రీనివాస కిరణ్, గ్రంధి యానాదిశెట్టి, బామా వ్యవస్థాపకులు బెజవాడ రవి కుమార్, సుధాకర్‌రెడ్డి, కేతిరెడ్డి రామ కోటారెడ్డి, లావణ్యకుమారి, నది మాస పత్రిక ఎడిటర్ జలదంకి ప్రభాకర్ తదితరులు వెంకారెడ్డి సేవలను ప్రశంసించారు. అనంతరం ఘన సన్మానం చేశారు. సన్మాన గ్రహీత వెంకారెడ్డి మాట్లాడుతూ అందరి అభిమానంతోనే ఇవన్నీ చేయగలిగానంటూ సొసైటీ కార్యక్రమానికి శాశ్వత భవనం ఏర్పాటు చేయలేకపోయానన్న బాధను వ్యక్తం చేశారు.

## రైతులకు నేరుగా విత్తనాలు!

వ్యవసాయ అధికారుల పర్యవేక్షణలో ఆయా సహకార సంఘాల ద్వారా రైతులకు విత్తనాలను సరఫరా చేసేందుకు అధికారయంత్రాంగం చర్యలు చేపడుతోంది. కలెక్టర్ ఆదేశాలతో జిల్లా కేంద్ర సహకార బ్యాంకు, వ్యవసాయశాఖ జెడి, ఎపి సీడ్స్ జిల్లా మేనేజర్ పర్యవేక్షణలో విత్తనాలను రైతాంగానికి నేరుగా అందించనున్నారు. ఈ ఖరీఫ్ సీజన్‌లో పచ్చిరొట్ట ఎరువులకుగాను 2200 క్వింటాళ్ల జనుములు సరఫరా చేయాలని లక్ష్యంగా నిర్ణయించారు. పొదలకూరు, ఆత్మకూరు, వింజమూరు, ఉదయగిరి మండలాలకు 300 క్వింటాళ్ల కందులు సరఫరా చేస్తామని అధికారులు చెప్తున్నారు. పిల్లిపెసర, జనుమును 50శాతం సబ్సిడీతో అందిస్తామన్నారు. జిల్లాలో 38 ప్రాథమిక వ్యవసాయ సంఘాల ద్వారా ఈ ప్రక్రియ కొనసాగుతుంది.

● ముత్తుకూరు

# మండల సమావేశంలో రగడ

ముత్తుకూరు మండల పరిషత్ సర్వసభ్య సమావేశంలో సభ్యుల మధ్య వాగ్వివాదం చోటు చేసుకొంది. ఇటీవల జరిగిన ఈ సమావేశం చివరిది కావడంతో ఎంపిటిసిలు, సర్పంచ్‌లు హాజరయ్యారు. ఈ సందర్భంగా సభ్యులు చేసిన వ్యాఖ్యలు పలువురి మధ్య వాదోపవాదాలకు దారితీశాయి. వైఎస్.రాజశేఖర్ రెడ్డి హయాంలో రైతులకు మేలు జరిగిందని కొందరనగా, మరికొందరు దానిని తీవ్రంగా ఖండించారు. రైతులకు గిట్టుబాటు ధర లభించలేదని, ఉత్పత్తులు పెరిగి ధరలు

**చివరి సమావేశానిదీ అదే దారి!**

పడిపోయాయన్నారు. ఈ విషయమై పొట్టెంపాడు సర్పంచ్ జయరామయ్య, వల్లూరు ఎంపిటిసి సభ్యుడు వేల్పుల మణికృష్ణల మధ్య వాగ్వివాదం జరిగింది. సర్పంచ్‌కు మద్దతుగా జడ్పీటిసి బందెల వెంకట రమణయ్య తోడవడంతో అరుపులు, కేకలతో మండల సమావేశం దద్దరిల్లింది. సమావేశం ప్రక్కదారి పడుతున్నదని గమనించిన ఎంపిడిఓ శ్రీహరి సభ్యులను శాంతపరచి, సర్దుబాటు చేసేందుకు ప్రయత్నించారు. ప్రస్తుత పాలకవర్గం పదవీ కాలం ముగియనుండడంతో చిట్టచివరి ఈ సమా వేశానికి ఎంపిపి లక్ష్మమ్మ, సర్పంచ్‌ల సంఘం అధ్యక్షుడు శేఖర్‌రెడ్డి, వైద్యాధికారి ఫ్లోరెన్సు, పశు వైద్యాధికారిణి ఇందిరారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# వెంకటగిరి ఎమ్మెల్యేపై అసంతృప్తి!

**● అభివృద్ధిపై దృష్టి పెట్టమంటున్న జనం**

వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ వ్యవహారశైలిపై ప్రజలు, పార్టీ కార్యకర్తల్లో అసంతృప్తి వ్యక్తమవుతోంది. అనుకొన్నది సాధిస్తాడని, పేదల సమస్యలు పరిష్కరిస్తాడని, పార్టీ కార్యకర్తలకు అండగా వుంటాడని భావించి మంత్రిగా పనిచేసిన రాజ్యలక్ష్మమ్మను కాదని ఆయన్ను ఎమ్మెల్యేగా గెలిపించారు. ఎమ్మెల్యే పదవి చేపట్టిన తర్వాత రామకృష్ణ అటు పార్టీ కార్యకర్తలు, ప్రజల ఆశలకు అనుగుణంగా పని చేయలేకపోతున్నాడనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. తరచూ అధికారులతో గొడవలు పడుతుండడం కూడా ప్రజలకు నచ్చడం లేదు. చిన్న చిన్న పనులకు సైతం అధికారులతో వివాదాలకు దిగడం వలన పనులు జరగక పోవడంతో ఆయన వ్యవహారశైలిపై ప్రజలు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. స్థానిక మున్సిపల్ కమిషనర్‌తో వివాదం, బాలాయపల్లి ఎంపిడిఓతో జగడం, ఆర్డీఓ ఇతర అధికారులతో నిత్యం వివాదాలు పెట్టుకొంటుండడంతో పార్టీ కార్యకర్తలు సైతం ఎమ్మెల్యే తీరును నిరసిస్తున్నారు. బాహాటంగా చెప్పకపోయినా ఆయన పనితీరు మార్చుకొని ప్రజాసమస్యలు పరిష్కారం అయ్యే దిశగా పోరు సాగించాలని అభిప్రాయపడుతున్నారు. పార్టీని నమ్ముకొన్న వారు ఇళ్లపట్టాలు పొందలేక గృహాలు నిర్మించుకోలేకపోతుండడం, కొత్త పింఛన్లు అందకపోవడం అధికారులతో సరిగా వ్యవహరించనందునే అనేది వారిలో వ్యక్తమవుతోంది.

## గ్రావెల్‌ను త్రవ్వేస్తున్నారు!

నాయుడుపేట మండలంలోని ప్రభుత్వ భూముల్లో గ్రావెల్‌ను అక్రమంగా త్రవ్వేస్తున్నారు. మండల పరిధిలోని శ్రీనివాసపురం గిరిజన కాలనీలో ఈ త్రవ్వకాలు అధికంగా వున్నాయి. దొరవారి సత్రం మండలం కొత్తపల్లి గ్రామానికి చెందిన తెలుగుదేశం నేత ఈ అక్రమ త్రవ్వకాలు జరుపుతున్నట్లు సమాచారం. లారీలు, జెసిబి యంత్రాలు ఆ స్థలంలో

**నాయుడుపేటలో పరిస్థితిది.**

వున్నప్పటికీ ఏ అధికారి అటువైపు కన్నెత్తి చూడకపోవడంతో యదేచ్ఛగా గ్రావెల్ త్రవ్వకాలు జరుగుతున్నాయి. దీనిపై గ్రామస్తులే రెవెన్యూ ఇన్స్పెక్టర్‌కు సమాచారం అందించారట. ఆయన స్థానిక విఆర్‌ఓను గ్రావెల్ త్రవ్వకాలు జరిగే భూముల వద్దకు పంపితే ఆయన వారితో లాలూచీపడి వాహనాలను వదిలిపెట్టడంపై గగ్గోలు రేగింది.

# ఇఫ్కో భూములు తిరిగివ్వమంటూ

# రైతుల ఆందోళన!



రాచర్లపాడు వద్ద ఇఫ్కో కిసాన్ సెజ్‌కు శంకుస్థాపన చేసిన దివంగత ముఖ్యమంత్రి రాజశేఖర్‌రెడ్డి. (ఫైల్‌ఫోటో)

వ్యవసాయ ఉత్పత్తుల కోసం సేకరించిన భూములను తిరిగి స్వాధీనం చేసుకునేందుకు రైతులు సన్నద్ధమవుతున్నారు. జిల్లాలోని కొడవలూరు మండలం రాచర్లపాడు సమీపంలో ప్రత్యేక ఆర్థిక మండలి(వ్యవసాయ సెజ్)ను ఏర్పాటు చేసేందుకు దివంగత ముఖ్యమంత్రి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి మూడు సంవత్సరాల క్రితం శంకుస్థాపన చేసిన సంగతి అందరికీ తెలిసిందే. సెజ్ ఏర్పాటు కోసం రైతుల నుంచి దాదాపు 2,500 ఎకరాలను తీసుకున్నారు. సంవత్సరాలు గడిచి పోతున్నా పరిశ్రమ నిర్మాణ పనులు మాత్రం నేటికీ ప్రారంభం కాలేదు.

ఒక ప్రక్క వరి పండే భూములను కోల్పోవడం, మరోప్రక్క ఉపాధి అవకాశాలు లేకపోవడంతో రైతులు భూముల్ని స్వాధీనం చేయాలని పట్టుబడుతున్నారు. రైతుల డిమాండ్‌కు రైతు సంఘాలు, ప్రతిపక్ష రాజకీయ పార్టీలు పూర్తి మద్దతు తెలుపుతున్నాయి. వ్యవసాయ సెజ్ ఏర్పాటు జరిగితే సమీపంలోని 15 గ్రామాల ప్రజలకు ఉపాధి అవకాశాలు కల్పిస్తారని ఎంతో ఆశపడ్డారు. భూములు కోల్పోయిన రైతులకు పరిహారం కూడా చాలా తక్కువగా చెల్లించారు. ప్రస్తుతం ఈ భూములు ఎకరా ఐదు లక్షల నుంచి పది లక్షల వరకు ధర పలుకుతున్నాయి. జాతీయ రహదారి ప్రక్కనే ఈ భూములు వుండడం ఇందుకు కారణం.

తొలుత ఇఫ్కో ఆధ్వర్యంలో ఎరువుల కర్మాగారం ఏర్పాటు చేయాలని భావించి, ఆ తర్వాత వ్యవసాయ ఉత్పత్తుల పరిశ్రమ ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. దీనికి సంబంధించి కాలుష్య నియంత్రణ మండలి ఆధ్వర్యంలో ప్రజాభిప్రాయ సేకరణ జరిగింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న సమీప గ్రామాల ప్రజలు పరిశ్రమను త్వరితగతిన ప్రారంభించాలని, ఉపాధి అవకాశాల్లో స్థానికులకే తొలి ప్రాధాన్యత ఇవ్వాలని అధికారులను కోరారు. ఇందుకు అంగీకరించిన అధికారులు పనులు ప్రారంభించడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. ప్రస్తుతం ఇఫ్కో భూముల చుట్టూ ప్రహరీగోడ నిర్మాణం పూర్తి చేసి వున్నారు. ఇఫ్కో పరిశ్రమ కోసం సేకరించిన భూముల్ని విదేశీ కంపెనీలకు విక్రయిస్తున్నారన్న ప్రచారం జరుగుతోంది.

ఈ ప్రచారాన్ని నమ్మిన రైతులు భూముల్ని తిరిగి అప్పగించాలని ఇటీవల ధర్నా చేశారు. విదేశీ కంపెనీల చేతుల్లోకి వెళితే భూములు దక్కకుండా పోతాయన్న భయంతో ఆందోళన బాట పడుతున్నారు. అవసరమైతే రైతు సంఘాల ఆధ్వర్యంలో ఆక్రమించేందుకు సిద్ధమని హెచ్చరిస్తున్నారు. అయితే రైతులు, రైతు సంఘాలు ఎన్ని ఆందోళనలు చేస్తున్నా ఇఫ్కో పరిశ్రమ అధికారులు ఏమాత్రం స్పందించడం లేదు. ప్రహరీ గోడ నిర్మాణం కోసం ఇప్పటికే కొన్ని కోట్ల రూపాయలు ఖర్చు చేసి వున్నారు. ఈ పరిశ్రమ ఏర్పాటు చేస్తారో లేదోనన్న సందేహం వ్యక్తమవుతుంది.

సెజ్‌ల కోసం కేటాయించిన భూముల్లో ఒక్క అపాచీ, ఎస్‌బిక్యు పరిశ్రమలు తప్ప మిగిలిన పరిశ్రమల్లో ఒక్కటి కూడా ఏర్పాటు జరగలేదు. నిర్ణీత కాల వ్యవధిలో పరిశ్రమను నెలకొల్పాల్సి వున్నప్పటికీ ఆ దిశగా ఏ పరిశ్రమ ప్రతినిధులు చర్యలు తీసుకోవడం లేదు. ఇఫ్కో సెజ్‌కు కూడా అదే పరిస్థితి ఏర్పడింది. రైతుల నుంచి వస్తున్న సందేహాలు, అనుమానాలను నివృత్తి చేసే బాధ్యత జిల్లా అధికార యంత్రాంగంపై వున్నప్పటికీ ఇప్పటివరకు ఎటువంటి ప్రకటన చేయకపోవడం విశేషం. ఇఫ్కో భూముల స్వాధీనానికి సమీప గ్రామాల ప్రజలు ఏ క్షణంలోనైనా ఉద్యమబాట పట్టే అవకాశం వుంది. J

## చాటుమాటు మాటలు

### జగన్ వర్గంపై వేటు




జగన్ వర్గీయుల్ని ఏరి ఏరి వేటు వేయడానికి కాంగ్రెస్ అధిష్టానం నిర్ణయించుకున్నట్లుంది. ఇందులో భాగంగానే కేంద్ర మంత్రి సాయిప్రతాప్‌పై మొదటి వేటు వేసింది. సాయిప్రతాప్ వైఎస్ వర్గానికి అత్యంత సన్నిహితుడు. సాయిప్రతాప్‌కు కేంద్రమంత్రి పదవి కోసం అప్పట్లో వైఎస్ తీవ్రంగా ప్రయత్నించారు. అయితే వైఎస్ మరణం, జగన్ తిరుగుబాటు నేపథ్యంలో సాయిప్రతాప్ మౌనంగా వున్నట్లు కనిపించారు. కానీ సాయిప్రతాప్ ఎప్పటి మాదిరిగానే వైఎస్ వర్గంతో 'టచ్'లో వుంటున్నారట. ముఖ్యంగా జగన్‌కు పరోక్షంగా మద్దతు పలుకుతున్నట్లు రాష్ట్రపార్టీ వర్గాలు అధిష్టానానికి ఫిర్యాదు చేశాయి. దీంతో సాయిప్రతాప్‌ను మంత్రివర్గం నుంచి తొలగించారు. త్వరలోనే రాష్ట్ర స్థాయిలో కూడా జగన్ వర్గీయులపై వేటు వేయడానికి రంగం సిద్ధమైనట్లు అభిజ్ఞవర్గాల భోగట్టా.

### తెలంగాణాలో 'బాబు' వ్యూహం ఫలించినట్లేనా?



తెలంగాణ తెలుగుదేశం ఎమ్మెల్యేల చేత రాజీనామా చేయించి, వెనువెంటనే బస్సు యాత్రను మొదలు పెట్టించిన చంద్రబాబు వ్యూహం ఫలించినట్టేనా! రాజధానిలోని రాజకీయ వర్గాలు ఈ విషయమై తీవ్రంగా చర్చించుకుంటున్నాయి. నిన్న మొన్నటిదాకా సమైక్యాంధ్రకు మొగ్గు చూపిన చంద్రబాబు తెలంగాణ పార్టీ వర్గాల వత్తిడితో ఎమ్మెల్యేల రాజీనామాకు పచ్చజెండా ఊపాడు. ఎలాగూ రాజీనామాలు చేశారు కాబట్టి ఇక ప్రజల్లోకి వెళ్లండంటూ ఓ బస్సును ఏర్పాటు చేశాడు. రాజీనామాలకు ముందు వరకు తెలుగు తమ్ముళ్లు తెలంగాణలో అడుగుపెట్టలేని పరిస్థితి వుండింది. రాజీనామాల నేపథ్యంలో ఇప్పుడు తెలంగాణలో తెలుగుతమ్ముళ్లకు స్వాగతం లభిస్తోంది. తెలంగాణలో తెలుగుదేశం దూసుకుపోతుండటం, రాజకీయ ఐక్యకార్యాచరణ సమాఖ్య సమావేశాలను 'డుమ్మా' కొట్టడం టిఆర్ఎస్ వర్గీయులకు కంపరం కలిగిస్తోంది. తెలుగు తమ్ముళ్ల స్పీడుకు బ్రేకు వేసేందుకు అక్కడక్కడా నిరసనలు తెలిపే కార్యక్రమాల్ని టిఆర్ఎస్ నెత్తిన వేసుకుందట. అయినా పచ్చబస్సు మాత్రం టిఆర్ఎస్ అవరోధాల్ని లెక్కచేయకుండా రయ్...మంటూ ముందుకు దూసుకుపోతోంది.

### రాజీనామాలతో 'పాలన'కు బ్రేక్



తెలంగాణ మంత్రుల రాజీనామాలతో రాష్ట్ర పరిపాలనకు బ్రేకులు పడుతున్నాయా! పరిస్థితుల్ని చూస్తుంటే నిజమేననిపిస్తోంది. తెలంగాణ ప్రాంతానికి చెందిన మొత్తం 12మంది మంత్రులు రాజీనామా చేశారు. ఇందులో కొంతమంది విధుల్ని ప్రక్కనబెట్టేశారు. సాంకేతికంగా మంత్రుల రాజీనామాలు ఆమోదం పొందలేదు కాబట్టి మరికొందరు మంత్రులు ఆటవిడుపుగా తమ శాఖల పనుల్ని చక్కబెడుతున్నారు. రాష్ట్రంలో వ్యవసాయ సీజన్ మొదలైన నేపథ్యంలో వర్షాభావం, ప్రత్యామ్నాయ పంటల ప్రణాళిక, స్మార్ట్‌కార్డ్‌ల పంపిణీ తదితర ముఖ్యవిషయాలపై చర్చించేందుకు ఈనెల 14,15 తేదీల్లో హైదరాబాదులో జిల్లా కలెక్టర్ల సమావేశం జరగాల్సి వుంది. అయితే తెలంగాణ మంత్రులు ఈ సమావేశాన్ని బహిష్కరిస్తారన్న సమాచారంతో సిఎం కిరణ్ తాత్కాలికంగా కలెక్టర్ల మీటింగ్‌ను వాయిదా వేశాడు. అలాగే ఈ నెల 16న జరగాల్సిన మంత్రివర్గ సమావేశాన్ని కూడా ముందుచూపుతో వాయిదా వేశాడు. మంత్రుల రాజీనామాల కారణంగా ఇలా కార్యక్రమాలన్నీ వాయిదాపడటం అధికారగణానికి, సిఎంకు కూడా తలనొప్పిగా మారింది.

### సినీ గిల్లికజ్జాల్లో 'కిరణ్'



సినిమా గిల్లికజ్జాల్లో సిఎం కిరణ్ వేలుపెట్టాడా! అవుననే అంటున్నాయి సినీవర్గాలు. ఆ మధ్య ఓ కార్యక్రమంలో పాల్గొన్న 'చిరు' తనయుడు 'రామ్‌చరణ్' పనిగట్టుకొని దాసరి నారాయణరావును విమర్శించాడు. దాంతో దాసరి అభిమానులైన మోహన్‌బాబు, జయసుధ, మురళీమోహన్ తదితరులు 'చిరు' వర్గంపై విరుచుకుపడ్డారు. 'చిరు' వర్గం తరపున పవన్‌కళ్యాణ్, అల్లు అరవింద్‌లు 'దాసరి' వర్గీయులపై రెచ్చిపోయారు. కాంగ్రెస్‌లోకి మారినప్పటి నుంచి 'చిరు' తన సామాజిక వర్గీయుల్ని వెనకేసుకురావడం ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌కు నచ్చడం లేదు. ముఖ్యంగా పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్యనారాయణకు 'చిరు' మద్దతు పలుకుతుండటాన్ని కిరణ్ సహించలేకపోతున్నాడు. బొత్సా భవిష్యత్ ముఖ్యమంత్రి అంటూ ప్రచారం జరుగుతున్న నేపథ్యంలో 'చిరు' మద్దతునివ్వడాన్ని కిరణ్ కాస్తంత సీరియస్‌గానే తీసుకున్నట్లున్నాడు. 'చిరు'ను దెబ్బతీయడానికి బహిరంగంగా 'దాసరి'ని సమర్థించాడు. సినీ పరిశ్రమలో దాసరి వర్గానికి పెద్దపీట వేస్తున్నాడు. 'దాసరి చెబితే సరి' అన్న ధోరణిలో కిరణ్ వ్యవహరిస్తూ సినీ గిల్లికజ్జాల్లో వేలుపెట్టేశాడు. దీంతో కిరణ్‌పై 'చిరు' గుర్రుగా వున్నట్లు అభిజ్ఞవర్గాల భోగట్టా.



● చాతుర్మాస దీక్షతో

# శ్రీహరి కృపాకటాక్షం!

పండుగలు, వ్రతాలకు హిందూ సాంప్రదాయాలలో విశేష ప్రాధాన్యముంది. కుటుంబ క్షేమాన్ని కాంక్షిస్తూ మహిళలు పలు వ్రతాలు చేస్తుంటారు. అలాంటి వాటిలో నాలుగు నెలలపాటు నియమనిష్టలతో చేసే వ్రతమే చాతుర్మాస వ్రతం. ఆషాడ శుద్ధ దశమి నుంచి కార్తీక శుద్ధ ద్వాదశి వరకు నాలుగు మాసాలు కొనసాగే వ్రతం కాబట్టే దీనికి చాతుర్మాస వ్రతం అని పేరొచ్చింది. లక్ష్మీదేవితో కలిసి శ్రీమహావిష్ణువు పాలకడలిలో శేషతల్పంపై శయనించే కాలంలో ఈ వ్రతాన్ని ఆచరించడం వలన ఎంతో పుణ్యం కల్గుతుందని పురాణాలు చెప్తున్నాయి.

ఆషాడ శుద్ధ దశమితో మొదలయ్యే ఈ చాతుర్మాస వ్రతానికి సంబంధించి పురాణ కథనం వుంది. లక్ష్మీదేవితో కలిసి శ్రీహరి వైకుంఠంలో వున్న సమయంలో త్రిలోక సంచారి అయిన నారదుడు హరిని దర్శించుకొంటాడు. అప్పుడు విష్ణుమూర్తి లోక విశేషాలను చెప్పమనగా ముల్లోకాలలో అశాంతి తాండవిస్తోందని, మానవులు ఎవరి తీరున వారు వుంటూ, విద్యుక్త ధర్మాలను పట్టించుకోక, పుణ్యవ్రతాలు పూజలు చేయక అహంకారంతో పరనింద పెరిగిపోయి పాపాత్ములుగా మారారని హింస, దుష్కృత్యాలు పెచ్చుమీరాయని చెప్పిన నారదుడు లోకాన్ని కాపాడమని వేడుకొంటాడు. అంతట రమా మాధవుడు లోక సంరక్షణ, ధర్మసముద్ధరణ కోసం లక్ష్మీదేవి సమేతుడై భూలోకానికి వస్తాడు. వృద్ధ దంపతుల రూపంలో వున్న వీరిని ఎవరూ పట్టించుకోక ఎవరికివారు మసలుకొంటూ వుంటారు. దీనిని గమనించిన శ్రీహరి రుషి వాటికలు చూసేందుకు పయనమై నైమిశారణ్యానికి వెళ్తారు. జ్ఞానసిద్ధుడనే యోగీంద్రుడు వీరిని గుర్తించి భక్తిశ్రద్ధలతో ఆరాధిస్తాడు. లోకాలు అతలాకుతలం అవుతున్నాయని దీన్నుంచి కాపాడి సన్మార్గంలో పయనించేలా చేయమంటాడు. ఋషి సపర్యలకు మెచ్చిన విష్ణుమూర్తి పాపకర్మలు తొలగి పుణ్యం లభించేందుకు చాతుర్మాస వ్రతాన్ని ఆచరించమని ఆశీర్వదిస్తాడు. మధుసూధనుడికి ఎంతో ఇష్టమైన ఈ వ్రతాన్ని చేయడం వలన శ్రీహరి కృపాకటాక్షం లభిస్తుందని, సకల శుభాలు కల్గుతాయని కార్తీక పురాణంలో చెప్పబడింది.

చాతుర్మాస వ్రతదీక్షను ఆషాడ శుద్ధ దశమి నాడు చేపట్టి కార్తీక శుద్ధ ద్వాదశి నాడు ముగించాలి. వ్రతారంభం చేసే మొదటి నెల అయిన ఆషాడంలో శాకాన్ని, రెండో మాసమైన శ్రావణంలో పెరుగును, తదుపరి నెల భాద్రపద దశమిలో పాలు, ఆశ్వియుజ మాసంలో పప్పుదినుసులు విడచి పెట్టాలి. నియమనిష్టలతో నాలుగు నెలలు వీటికి దూరంగా వ్రతాన్ని చేపట్టినట్లయితే ముక్తి కల్గుతుంది.






## మళ్లీ వేషాలు!

కేవలం గంట వ్యవధిలో పలు వేషాలు వేసిన ఘనత విశ్వవిఖ్యాత నటసార్వభౌమ నందమూరి తారక రామారావుకు దక్కలేదేమో. కాని రూరల్ వివేకానందరెడ్డి కేవలం 15 నిమిషాల వ్యవధిలో నాలుగు వేషాలు వేశాడు. గతవారం ఒక వస్త్ర సముదాయం ప్రారంభానికి వెళ్లిన ఆయన తొలుత పట్టుచీరలు సింగారించుకొన్నారు. ఆ తర్వాత ఆధునిక పెళ్లి కొడుకు దుస్తులు ధరించారు. ఆ తర్వాత రాజుల టోపీ ధరించి మాడల్స్ ప్రక్కన ఫోజులకు నిలబడ్డారు. ఇక్కడ నుంచి స్టోన్‌హౌస్‌పేటకు వెళ్లిన ఆయన దారిలో ఓ రిక్షా కార్మికుడిని ఆపి బీడి అడిగి తీసుకొని గప్పున లాగుతూ మీటింగ్‌లో బీడి గొప్పతనాన్ని గూర్చి ఐదు నిమిషాలు మాట్లాడారు. వివేకా వేషాలు చూసి ఆయన జంట ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి కూడా విస్తుపోయాడు పాపం.




## ఇది నిజమా?

రూరల్ ఎమ్మెల్యే వివేకానంద రెడ్డికి నోటికి వచ్చినట్లు మాట్లాడడం అలవాటు. ప్రజలు కూడా ఆయన మాటలు పెద్ద సీరియస్‌గా తీసుకోరు. నెల్లూరు తెలుగుదేశం నాయకులు కార్పొరేటర్లు కూడా కాలేని దద్దమ్మలని, మునిసిపల్ లైట్ల దొంగలని తిట్టిన సమావేశంలో వందల కోట్ల రూపాయల అభివృద్ధి పనులు నెల్లూరులో జరుగుతున్నాయన్నారు. 121 కోట్ల రూపాయలతో సమ్మర్ స్టోరేజి ట్యాంకు, 75 కోట్లతో రోడ్లు, డ్రైన్లు అభివృద్ధి చేశాం. 745 కోట్లతో మురికివాడలను సుందరవాడలు చేసేస్తున్నామన్నారాయన. ఆయన ఒక్క ప్రెస్‌మీట్‌లో వివరించిన వివరాల ప్రకారం వెయ్యి కోట్ల రూపాయల అభివృద్ధి నెల్లూరు నగరంలో జరిగిందన్న మాట. మరి అంత ఎక్కడా కనపడడం లేదన్నది ట్రంకురోడ్డులో జనం చర్చల్లో వినపడుతున్నమాట. కాని వివేకాను ప్రశ్నించేవారు ఎవరు?

## ఫోన్ చేయమంటారా?



నెల్లూరీయుడు వేణుంబాక దినేష్‌రెడ్డి డిజిపి అయినందుకు అందరూ సంతోషిస్తుంటే ఎస్ఐ, సిఐ, డిఎస్పీలు మాత్రం లోలోన తెగబాధపడి పోతున్నారు. రోడ్లపై కార్లలో వెళ్లే విఐపిలను ఆపి లైసెన్సులు అడిగితే ఒక్క వుదుటున దిగేసి డిజిపితో ఫోన్ కలపమంటారా అంటున్నారట. ఒకరిద్దరు ఎస్ఐలు ఫోను చేయమంటే చేసిన సాదృశ్యాలు చోటు చేసుకొన్నాయి. లా అండ్ ఆర్డర్ పోలీసులకు మరీ ముఖ్యంగా ముత్తుకూరు, తోటపల్లిగూడూరు పోలీసులైతే ఎవర్ని ఏమంటే ఏ ఇబ్బందులు వస్తాయోనని మౌనంగా స్టేషన్లలో కూర్చొని వుంటున్నట్లు పోలీసు వర్గాల్లో విపరీతంగా చర్చ నడుస్తుంది.

## ఎంత ధైర్యం?



పోలీసుల వ్యవహార సరళి చూసి వారి పిల్లలు కూడా ఆ మార్గానే నడుస్తుంటారన్న విషయం ఈ వారం నగరంలో బయటపడింది. నగరంలోని ఇరుగాళమ్మ గుడి సెంటర్‌తోపాటు, పోలీసాఫీసు వద్ద దారిన వెళ్లే వాహనాలను కానిస్టేబుల్ వేషంలో ఓ యువకుడు ఆపి మామూళ్లు వసూలు చేస్తున్నాడని పోలీసుకు పోబిడి అందింది. తమ కానిస్టేబులే అనుకొని కొన్నాళ్లు పోలీసులు ఊరుకొన్నారు. కాని వన్‌టౌన్ ఎస్ఐ ఈ సమాచారంపై లోతు విచారణ చేయను మఫ్టీలో రెండు మూడు రోజులు పై మార్గాల్లో తిరగ్గా దొంగ కానిస్టేబుల్ అరవ మణి దొరికిపోయాడు. పట్టుకొన్న తర్వాత అతను పోలీసు కానిస్టేబుల్ కుమారుడని తెలిసింది. ఇతని సోదరి కూడా పోలీసుశాఖలో పని చేస్తుందన్న విషయం తెలుసుకొని విస్తుపోవడం పట్టుకొన్న వన్‌టౌన్ ఎస్ఐ వంతయ్యింది.

## నెల్లూరులోనూ అనంతపద్మనాభుడు!




తిరువనంతపురంలోని అనంత పద్మనాభస్వామి ఆలయంలో బయటపడ్డ అనంత సంపదపై అంతటా విస్తృతంగా చర్చలు జరుగుతున్నాయి. జిల్లాలోని నరసింహకొండపై వున్న ఏడు కోనేర్ల దగ్గర అనంతపద్మనాభస్వామి గుడి పోబిడి దొరికింది. దీంతో జనం నరసింహకొండకు వెళ్లి స్వామిని దర్శించుకొంటున్నారు. ఇక్కడ కూడా ఒక సొరంగం వుందన్న ప్రచారం వుంది. ఇది దగదర్తి మండలంలోని పాండవుల తిప్ప అక్కడ నుంచి ప్రకాశం జిల్లా చాకలికొండ వరకు విస్తరించి వుందని ట్రంకురోడ్డులో జోరుగా చర్చలు జరుగుతున్నాయి. ఈ సొరంగంపై సందేహాలు పురావస్తు శాఖాధికారులే తీర్చాలి.

# వారఫలాలు

తేది 16-7-2011 నుండి 22-7-2011 వరకు మిథున, కర్కాటకాల్లో రవి, మిథునంలో శుక్రుడు; కర్కాటకంలో బుధుడు; మేషంలో గురువు; వృషభంలో కుజ, కేతువులు; వృశ్చికంలో రాహువు; కన్యలో శని; మకర, కుంభ, మీనాల్లో చంద్రుడు సంచరిస్తారు.



**మేషం** అశ్విని, భరణి, కృత్తిక 1 పా

ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. నెమ్ముకు సంబంధించి ఇబ్బంది పడతారు. కుటుంబసభ్యుల తోడ్పాటు చక్కగా వుంటుంది. అనవసర విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. ఆర్థికలావాదేవీలలో జాగ్రత్త. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా వుండడానికి ప్రయత్నించండి. రాజకీయులు తోటివారి విషయంలో జాగ్రత్తగా వుండాలి. ఉద్యోగులకు పైఅధికారుల సాయం లభిస్తుంది.



**వృషభం** కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ఉద్యోగులకు శ్రమాధిక్యత. పైవారి ఆగ్రహానికి గురౌవుతారు. నిద్రలేమి, జ్వరం వంటి బాధలుంటాయి. సోదరుల మూలంగా ఇబ్బందులుండవచ్చు. ధన విషయంలో కటకట వుండవచ్చు. ఖర్చులధికం. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులకు అమ్మకాలు తగ్గుముఖం పడతాయి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది.



**మిథునం** మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు1,2,3 పా

ఇరుగుపొరుగువారి తోడ్పాటు చక్కగా వుంటుంది. ఆరోగ్య విషయంలో శ్రద్ధ అవసరం. ప్రయాణాలు ఫలవంతమవుతాయి. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. తోటివారు సాయమందిస్తారు. నూతన మిత్రులు ఏర్పడతారు. కీళ్లబాధలుంటాయి. గృహాలంకరణ, రిపేర్లలో శ్రద్ధ చూపుతారు. వ్యాపారవృద్ధి చక్కగా సాగుతుంది. రాజకీయులకు మేలైన కాలం. విద్యార్థులకు యోగకాలం.



**కర్కాటకం** పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

కీళ్లకు సంబంధించి ఇబ్బందులుంటాయి. ధనాదాయం బాగుంటుంది. సంతానమూలంగా సుఖసంతోషాలు. వ్యాపారులకు భాగస్వాముల మూలంగా మంచి లాభప్రాప్తి వుంటుంది. వృత్తిపరులు తమ మూర్ఖత వల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు శ్రమ అధికం. సరైన ప్రోత్సాహం వుండదు. వ్యాపారుల లావాదేవీలు సక్రమంగా వుండవు.



**సింహం** మఖ, పుబ్బ, ఉత్తర 1 పా

ఆంత్రసంబంధిత బాధలధికం. సంతాన వివాహ విషయాలు మానసిక వేదనకు గురి చేస్తాయి. ధన విషయంలో తండ్రి సోదరులతో ఇబ్బందులు రావచ్చు. ఇరుగుపొరుగువారి సహాయం అందవచ్చు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు కొంత వెసులుబాటు. ఎదురుచూసిన సత్ఫలితాలు దక్కవు. ఎవరికి ఎలాంటి మాట ఇవ్వవద్దు. విద్యార్థులకు కొంత మేలు.



**కన్య** ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

పొత్తికడుపుకు సంబంధించి ఇబ్బంది ఉండవచ్చు. తల్లి అనారోగ్యం కొంత కుదుటపడుతుంది. వృత్తిలో మార్పు చేర్పులు. దూర వార్తా శ్రవణం ప్రయోజనకారి. వ్యాపారులకు కొంతవరకు మేలు. పోటీ లెక్కువ. భాగస్వాములతో జాగ్రత్త. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు చదువు సాగదు. కళాకారులకు ఆశాభంగం. ఉద్యోగులకు శ్రమ తగ్గుముఖం పడుతుంది.

## పంచాంగం

17 తేది కర్కాటక సంక్రమణం.
దక్షిణాయన ప్రారంభం.
18 తేది సంకష్టహర చతుర్థి.

**శుభ ముహూర్తాలు**

16, 17, 18, 21 తేదీలలో సింహ లగ్నాన ఉ.8.30 నుండి 10.00గంటల వరకు సాధారణ శుభ ముహూర్తాలున్నాయి.

**జూలై తిథులు**
**ఆషాఢ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 16 | శని | పాడ్యమి | ప 12.05 | గం.ల.వ |
| 17 | ఆది | విదియ | ప 12.29 | గం.ల.వ |
| 18 | సోమ | తదియ | ప 01.25 | గం.ల.వ |
| 19 | మంగళ | చవితి | ప 02.52 | గం.ల.వ |
| 20 | బుధ | పంచమి | ప 04.46 | గం.ల.వ |
| 21 | గురు | షష్ఠి | రా 06.59 | గం.ల.వ |
| 22 | శుక్ర | సప్తమి | రా 09.20 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com



**తుల** చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

కుటుంబసభ్యుల నుండి సహాయ సహకారాలందవు. ఊహించని రీతిలో ధనవ్యయమౌతుంది. వ్యాపారులకు, వృత్తిపరులకు మేలైన కాలం గాదు. గృహిణులకు సంతానమూలంగా మనశ్శాంతి వుండదు. పాదాలు రుగ్నాలవుతాయి. ఆర్థిక సమస్యలుంటాయి. రాజకీయులు జాగ్రత్తగా నడచుకోవాలి. విద్యార్థులకు వృథా కాలక్షేపం. గృహిణులకు అంతగా మేలుఫలితాలు కానరావడం లేదు.



**వృశ్చికం** విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

కళత్రం తోటి సంబంధాలు చక్కగా వుంటాయి. వాహనాలు నడిపే సమయంలో జాగ్రత్త. ధనవిషయాలలో లోటు లేదు. రుణరూపంలో కూడా ధనప్రాప్తి. వ్యాపారుల్ని భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. వ్యాపారంలో పోటీ తగ్గుముఖం పడుతుంది. ఉద్యోగులకు ప్రమోషన్ లేదా ఆదాయవృద్ధి వుండవచ్చు. రాజకీయులకు ఉత్తమ కాలం. వృత్తిపరులు లాభపడతారు. విద్యార్థులకు కొంత మేలు.



**ధనుస్సు** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

కళత్రసంబంధం చక్కగా వుంటుంది. ఉద్యోగంలో నూతన బాధ్యతలు అధికం. చిరకాలంగా ఎదురు చూస్తూవచ్చిన శుభఫలితాలు అనుభూతిలోనికి వస్తాయి. శత్రువుల బాధ తొలగుతుంది. బంధువులకు మీ చేతనైన సహాయం చేస్తారు. వ్యాపారులు కొత్తసంబంధాలు ఏర్పరచుకొంటారు. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. వృత్తిపరులకు కళాకారులకు మంచి ఆదరణ.



**మకరం** ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

పిల్లల అనారోగ్యం కొంతమెరుగు. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా ఉన్నందున స్పెక్యులేషన్ లాభించవచ్చు. దైవకార్యాలలో పాలుపంచుకొంటారు. వ్యాపారులు భాగస్వాములతో జాగ్రత్తగా మెలగాలి. పైవారి ఆదరణతో ఉద్యోగులు లాభపడతారు. భూభవనాల, వస్తు వాహనాల ద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి. రాజకీయులకు ప్రోత్సాహం తక్కువ. విద్యార్థులకు కొంత మేలు.



**కుంభం** ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా

ఆరోగ్యవిషయంలో ఒత్తిడి వల్ల ఇబ్బందులు. సంతానమూలంగా సుఖశాంతులు కానవస్తాయి. చాలా మేలైన కాలం. కళత్ర సుఖం చక్కగా వుంటుంది. వృత్తిరీత్యా ఉత్సాహం, శ్రమ, ధనాదాయం అధికమౌతుంది. స్పెక్యులేషన్ లాభిస్తుంది. రాజకీయులకు అనుకూలమైన కాలం. వృత్తిపరులకు కీర్తిప్రతిష్టలు పెరుగుతాయి. గృహిణులకు ఇరుగు పొరుగువారితో మంచి సంబంధాలుంటాయి.



**మీనం** పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

ఆర్థిక విషయాల కటకట కొద్దిగా తొలగుతుంది. నూతన వస్త్రాభరణాలకై వెచ్చిస్తారు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. ఖర్చుకు వెరవరు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. మానసిక వేదన, ఒత్తిడి అధికం. స్పెక్యులేషన్ మంచిది కాదు. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు. వ్యాపారులు అధికంగా కష్టపడాలి. రాజకీయులు పైవారి ఆదరణకు పాత్రులవుతారు.

# శని ప్రభావ లోహాల వాడకం అనర్ధదాయకం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.సుమతీచంద్ర ఉదయగిరి*

* *కొత్త యింటికి పాత ఇనుము పరికరాలు, ఇటుకలు వాడవచ్చునా?*

పాత గృహం, ఆలయానికి వాడిన ఏ వస్తువులైనా కొత్త యింటికి వాడటం అనారోగ్యాన్ని, మృత్యువును కలిగిస్తాయని 'బ్రహ్మస్ఫుట సిద్ధాంత' గ్రంథం చెబుతోంది. లోహాలు వాడితే 'శని ప్రభావం' మృత్యువు దాకా తీసుకెళ్తుందని శాస్త్రాలు చెబుతున్నాయి.

*సి.వి.లక్ష్మీతులసి తోటపల్లి*

* *దక్షిణ వీధి తూర్పు ఇల్లు కట్టుకున్నాము. ఆడపిల్లల పరిస్థితులు బాగాలేవు.*

రాజవీధి వైపే గృహ నిర్మాణం జరగాలి. విరుద్ధ దిశావేధ మిమ్మల్ని పీడిస్తున్నది. దక్షిణం భ్రష్టం కాగా యమస్థాన ప్రభావం అమ్మాయిలపై ప్రసరించింది. నవగ్రహ ప్రదక్షిణ కొంత మేలు చేస్తుంది.

*పి.అనూరాధ నెల్లూరు*

* *ఈశాన్యం బ్లాకు స్థలం తీసుకోవచ్చునా?*

ఏ బ్లాకైనా 'కోణవేధ' లేకుండా తీసుకోవాలి. దిక్సూచికి 'కోణం' కాకూడదు. వాస్తు సిద్ధాంతి అభిప్రాయాన్ని తీసుకోండి.

*ఎన్.ఆర్.రమేష్‌రెడ్డి చిత్తూరు*

* *ప్లాటు ప్రక్కన 'లిఫ్టు' వుండవచ్చునా?*

అది 'దిక్సూచికి కోణాన్ని చూపించే భాగమై' వుంటే అరిష్టం. జాగ్రత్తగా చూపించి తీసుకోండి.

*శ్రీవత్సల రాపూరు*

* *అమ్మాయిది వృషభరాశి, అబ్బాయిది కర్కాటక రాశి. వీరికి వివాహం చేయవచ్చునా?*

అబ్బాయిది కర్కాటకం, బ్రాహ్మణ వర్ణు, అమ్మాయిది వృషభం శూద్ర వర్ణు. అబ్బాయి వర్ణు అగ్ర వర్ణు గనుక వివాహం చేయవచ్చు. ఇద్దరిదీ ఒకే వర్ణు అయినా అభ్యంతరం లేదు.

*కె.శాంభవి బెంగుళూరు*

* *రోగ నిదానం కూడా గృహ వాస్తును బట్టే వుంటుందా?*

కర్మ ఫలితములు, జ్యోతిష నిదాన విధానముల తర్వాత గృహవాస్తు మనిషి ఆర్థిక, ఆరోగ్య స్థితులపై ఎక్కువ ప్రభావాన్ని చూపిస్తాయి. గృహం సవాస్తు అయితే రోగి అయిన యజమాని ఆరోగ్యవంతుడుగాను, అవాస్తు అయితే ఆరోగ్యవంతుడు అనారోగ్యవంతుడుగానూ మారుతారని 'మానసార శాస్త్రం' ఉవాచ.

*ధూళిపాళ్ల మాధవి చెన్నై*

* *తూర్పు ఎదురు వీధి వుంది. అక్కడ తలుపు పెట్టవచ్చునా?*

తూర్పు ఆగ్నేయం వీధిపోటు. ఇది స్త్రీ సమస్యల్ని తెస్తుంది. తూర్పు ఆగ్నేయం నీచస్థానం. అందులో తలుపు తెరవకూడదు. వ్యాధుల్ని కలుగజేస్తుంది.

*కె.సుజనలక్ష్మి నాయుడుపేట*

* *మా అమ్మాయిలది ఆశ్లేష, మఖ నక్షత్రాలు. వీరికి ఏ నక్షత్రాలున్న వారితో వివాహం చేయరాదు?*

ఆశ్లేషకు – మూలా నక్షత్రం, మఖకు – రేవతి నక్షత్రం పరస్పర వేధ వున్న నక్షత్రాలు. ఇలా 'వేధ' వచ్చిన వారితో వివాహం చేయరాదు.

*జె.ధనరాజ్ నెల్లూరు*

* *అపార్టుమెంటు, ప్లాటు ప్లాను, ఫ్వోటో పంపిస్తున్నాను.*

అపార్టుమెంటుకు పూర్తిగా తూర్పు ఆగ్నేయ దోషం వుంది. ఇది మొత్తం గృహస్తు భార్యపై ప్రభావం చూపిస్తుంది. దక్షిణం రాజవీధి కాగా, తూర్పు నిర్మాణం వల్ల రెండు దిశలు భ్రష్టమవుతాయి. ఖాళీ చేయడం మంచిది.

*ఎల్.నాగరాజు ఖమ్మం*

* *దీర్ఘచతురస్రం స్థలంలో నిర్మాణంలో ఖర్చులు ఎక్కువ అంటారు నిజమేనా?*

గృహస్తుకు, పశువులకు అసౌకర్యమని 'వాస్తు విద్య' గ్రంథం చెబుతోంది. ఖర్చులకు సంబంధం లేదు.

*పి.కళ్యాణి వెంకటగిరి*

* *రెండు వీధులున్న స్థలాలు కొనుగోలు చేయవచ్చునా?*

రెండు వీధులున్న స్థలాలు ఎదురు, వెనుక రోడ్లున్నవి, బ్లాకు స్థలాలు అవుతాయి. వాటివల్ల 'కోణవేధ'లు, దృష్టి దోషాలు ఎక్కువ. కొనకపోవడమే మంచిది.

● ధృవీకరణ పత్రాల జారీపై

# పొంతనలేని ప్రకటనలు!

**విద్యా సంవత్సరం ప్రారంభం కావడంతో పాఠశాలలు, కళాశాలల్లో చేరేందుకు విద్యార్థులకు అవసరమైన ధృవీకరణ పత్రాలు ప్రజాసేవా కేంద్రాలు, ఈ-సేవా కేంద్రాలలో పొందవచ్చని వున్నతాధికారులు ప్రకటించినా ఇక్కడ ఈ పత్రాలిచ్చేవారే లేకుండాపోయారు.**



ఈ-సేవా కేంద్రంలో పనులు జరగడం లేదు.

సహజంగా రాజకీయ నాయకులు చిత్రవిచిత్ర ప్రకటనలు చేస్తూ ప్రజలను పలు విధాలుగా నమ్మించేందుకు ప్రయత్నాలు చేస్తుంటారు. రాజకీయ నేతలకంటే తాము దేనిలో తీసిపోమంటూ ప్రభుత్వ అధికారులు సైతం పొంతనలేని ప్రకటనలు చేస్తున్నారు. ఈ ప్రకటనలు చూసిన ప్రజలు ఎవరి మాట నమ్మాలో తెలియక గందరగోళానికి గురవుతున్నారు. జిల్లా కలెక్టర్ ఒక ప్రకటన చేస్తే ఆర్డీఓ, తహశీల్దార్లు మరో ప్రకటన చేస్తున్నారు. మండల తహశీల్దార్ కార్యాలయాల్లో ప్రజాసేవ కేంద్రాలు, ఈ-సేవా కేంద్రాలు, బిసిసెల్ కేంద్రాలు ఇందుకు వేదికగా మారాయి.

ప్రజాసేవా కేంద్రాలు, ఈ-సేవా కేంద్రాల్లో ప్రజలకు అవసరమైన అన్ని ధృవీకరణ పత్రాలు పొందవచ్చునని జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్లు తరచూ ప్రకటిస్తుంటారు. వాస్తవంగా ఆయా కేంద్రాలకు వెళ్లి అవసరమైన పత్రాలు అందజేయాలని దరఖాస్తు చేస్తే అక్కడ సిబ్బంది తిరస్కరించడం లేదా కంప్యూటర్లు పని చేయడం లేదంటూ సమాధానం చెబుతుంటారు. జిల్లాస్థాయి అధికారులు జారీ చేసిన ప్రకటన గుర్తు చేస్తే వారినే వెళ్లి అడగండంటూ వ్యంగ్యంగా వ్యాఖ్యానిస్తున్నారు. ఈ కేంద్రాల సిబ్బందితో వాదనకు దిగలేక వెనుదిరగాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది.

## విద్యార్థుల ఇక్కట్లు

విద్యాసంవత్సరం ప్రారంభం కావడంతో పాఠశాలలు, కళాశాలలు, వసతిగృహాల్లో చేరే విద్యార్థులు కుల, ఆదాయ, నివాస ధృవీకరణ పత్రాల కోసం మండల తహశీల్దార్ కార్యాలయాలకు వెళ్తున్నారు. ఈ విద్యాసంవత్సరం నుంచి తాత్కాలిక ధృవీకరణ పత్రాలు ఇవ్వరాదని, కంప్యూటరైజ్డ్ ధృవీకరణ పత్రాలు జారీ చేయాలని ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. దీంతో జిల్లాలోని అందరు తహశీల్దార్లు ధృవీకరణ పత్రాలు జారీ చేయడం మానేశారు. ఆదాయం, నివాస ధృవీకరణ పత్రాలు కంప్యూటర్ ద్వారా అందించాలని, కుల ధృవీకరణ పత్రం మాత్రం పర్మినెంటుది జారీ చేయాలని నిర్ణయించారు.

ఈ విధానం వల్ల విద్యార్థులు తీవ్రంగా నష్టపోయే పరిస్థితి ఏర్పడింది. విద్యార్థులు ఇబ్బంది పడకుండా ధృవీకరణ పత్రాలు జారీ చేయాలని జిల్లా కలెక్టర్ ఆదేశించినా తహశీల్దార్లలో మాత్రం ఎటువంటి మార్పు కానరాలేదు. కంప్యూటరైజ్డ్ ధృవీకరణ పత్రాల కోసం కనీసం పదిరోజులకుపైగా సమయం పడుతుంది. ఎస్సీ, ఎస్టీ, బిసి విద్యార్థులు తప్పనిసరిగ కుల ధృవీకరణ పత్రం కళాశాలల్లోనూ, వసతి గృహాల్లో సమర్పించాల్సి వుంటుంది. ధృవీకరణ పత్రాల కోసం విద్యార్థులపై ఒత్తిడి తీసుకురావద్దని ఒకప్రక్క చెబుతున్నా, సంబంధిత కళాశాలలు, వసతి గృహాల అధికారులు ధృవీకరణ పత్రాలు లేనిదే ప్రవేశం కల్పించలేమంటూ చేతులెత్తేస్తున్నారు.

జిల్లా ఉన్నతాధికారుల ఆదేశాలకు తహశీల్దార్లు చెబుతున్న దానికి చాలా వ్యత్యాసం వుంటుంది. వీరి మధ్యన సామాన్య ప్రజలు, పేద విద్యార్థులు నలిగిపోతున్నారు. ఇదిలా వుండగా ఆధార్ కార్డుల కోసం ఏర్పాటు చేయబడిన బిపిఎల్ కేంద్రాల పరిస్థితి చాలా అధ్వాన్నంగా మారింది. ఆధార్‌కార్డులు లేనిదే రేషన్ సరుకులు ఇవ్వడం కష్టమని ప్రభుత్వం ప్రకటించింది. అయితే ఆధార్ కార్డులు జారీ చేసే ప్రక్రియ కొన్ని మండలాల్లో నేటికి ప్రారంభం కాలేదు. ఈ కేంద్రాలు సక్రమంగా నిర్వహించాల్సిన అధికారులే వీటి గురించి పట్టించుకోవడం లేదు.

ప్రభుత్వ వైఖరి, జిల్లా అధికారుల తీరుతో ప్రజలు ఇబ్బంది పడకతప్పడం లేదు. ప్రజాసేవా కేంద్రాలు, ఈ-సేవా కేంద్రాలతోపాటు బిపిఎల్ కేంద్రాలను ప్రక్షాళన చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

పేరుకే ఆదర్శ డివిజన్లు

# ఆదర్శ డివిజన్లలో అభివృద్ధి ఏది?

కార్పొరేషన్ పాలకవర్గం గడువు ముగియడంతో అధికారులు ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తున్నారు. నగరంలో అభివృద్ధి పనుల గురించి అసలు పట్టించుకోవడం మానేశారు. కేవలం ఎమ్మెల్యేలు సూచించిన ప్రాంతాలలోనే పనులు చేపడుతున్నారు. ఇతర ప్రాంతాలపై దృష్టిసారించడం లేదు. దీంతో ఎక్కడ సమస్యలు అక్కడే పేరుకు పోతున్నాయి. ఆదర్శ డివిజన్లుగా ఎంపిక చేసిన ప్రాంతాలను అన్నివిధాల అభివృద్ధి చేయాలని గతంలో నిర్ణయించారు. ఇందుకు అవసరమైన నిధులున్నప్పటికీ వాటిని ఇతర పనులకు మళ్లిస్తున్నారన్న ఆరోపణలు వున్నాయి.

ఎంపిక చేసిన ఆదర్శ డివిజన్లలో సిసి రోడ్లు, ఇందిరమ్మ గృహాలు, కమ్యూనిటీ హాళ్లు, పొదుపు మహిళలకు బ్యాంకు లింకేజి రుణాలు, పారిశుధ్యం మెరుగు పరిచేందుకు కృషి చేయాలి. ఇదంతా కార్పొరేషన్ పాలకవర్గం గడువు ముగియక ముందు తీసుకున్న నిర్ణయాలు. పాలకవర్గం వున్న సమయంలో ఆదర్శ డివిజన్లకు చెందిన కార్పొరేటర్లు కార్పొరేషన్ అధికారులపై ఒత్తిడి తెచ్చి పనులు చేయించుకునేందుకు ప్రయత్నాలు చేసేవారు. ఇప్పుడు పరిస్థితి పూర్తిగా మారిపోయింది. అధికారులే పనులు మంజూరు చేయడం దగ్గర నుంచి పనులు పూర్తి చేసే వరకు అన్ని నిర్ణయాలు తీసుకుంటున్నారు. ప్రజలకు ఏ పనులు అవసరమో వాటిని గుర్తించి చేయడం లేదు.

**నెల్లూరు కార్పొరేషన్ పరిధిలో ఎంపిక చేసిన ఆదర్శ డివిజన్లలో సిసిరోడ్లు, ఇందిరమ్మ గృహాలు, కమ్యూనిటీ హాళ్లు, పొదుపు మహిళలకు బ్యాంకు లింకేజి రుణాలు, పారిశుధ్యం మెరుగుపరిచేందుకు కృషి చేయాలి. కాని ఇవి జరగడం లేదు.**

## ప్రతిపక్ష నేతల ఆందోళన

ఆదర్శ డివిజన్లతోపాటు ఇతర డివిజన్లలో అనేక సమస్యలు పేరుకుపోయాయి. ప్రధానంగా త్రాగునీటి సమస్య నగర ప్రజల్ని పట్టిపీడిస్తుంది. దీనిపై కార్పొరేషన్ అధికారులు సరిగా స్పందించడం లేదని సిపిఎం, తెలుగుదేశం పార్టీల నేతలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. రూరల్ ఎమ్మెల్యే చెప్పిన విధంగా అధికారులు వ్యవహరిస్తున్నారని ఆరోపణలు చేస్తున్నారు. నగరంలో చేపట్టే ప్రతి పని విషయంలో ఎమ్మెల్యే జోక్యం చేసుకుని తన అనుచరులకు కాంట్రాక్టు ఇప్పించుకుంటున్నారని విమర్శిస్తున్నారు.

కార్పొరేషన్ ప్రత్యేకాధికారిగా వుండి అదనపు జెసిగా పదవీ విరమణ చేసిన సీతారామయ్య కూడా కార్పొరేషన్ అధికారులను గాడిలో పెట్టలేకపోయారు. పేరుకే ప్రత్యేకాధికారిగా వుండినారే తప్ప ఆయన ఎటువంటి పనులు చేయించలేకపోయారు. కార్యాలయంలో ఏం జరుగుతుందో కూడా తెలుసుకోలేని విధంగా ఆయన వ్యవహారశైలి వుండేది. ఫైళ్లపై సంతకాలకే ఆయన పరిమితమైపోయారు. ఏనాడు కూడా అధికారులు, సిబ్బంది పని తీరు గురించి పర్యవేక్షణ చేసిన దాఖలాల్లేవు. ప్రతిపక్ష పార్టీలకు చెందిన మాజీ కార్పొరేటర్లు పలు దఫాలు ఆదర్శ డివిజన్ల గురించి ప్రస్తావించినా వినే దిక్కు లేకుండా పోయింది.

ఇదిలా వుండగా కేంద్ర ప్రభుత్వం రాజీవ్ ఆవాస్ యోజన పేరుతో మురికి వాడల అభివృద్ధికి శ్రీకారం చుట్టింది. ఇప్పటికే ఈ పథకానికి సంబంధించి సర్వే పూర్తి చేయడం జరిగింది. ఇందుకు కోట్ల రూపాయల నిధులు కార్పొరేషన్‌కు విడుదలైనట్లు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి గొప్పలు చెప్పుకొంటున్నారు. కేంద్రం నుంచి విడుదలైన ఈ నిధులనైనా ఏ మేరకు మురికి వాడల అభివృద్ధికి వినియోగిస్తారో వేచి చూడాలి.

# 180 – బలహీనం



అల్లూరు రహీం

చావును తప్పించుకోవడం మానవునికి సాధమయ్యే పనికాదు. కానీ అమెరికాలోని గొప్ప వైద్య సంస్థలో పనిచేసే డాక్టర్ తాను చావబోతున్నానని తెలుసుకొని గజగజ వణికి పోవడం, సైకోలా ప్రవర్తించడం అసహజం. ఇదే వైవిధ్యమంటూ సత్యం సినిమాస్, అఘాల్ ఫిల్మ్ పతాకంపై సంయుక్తంగా నిర్మించిన చిత్రం 180 ప్రేక్షకుల మనసులను తాకలేదు. వాస్తవానికి 180లో అద్భుతమైన రెండు ప్రేమ కథలున్నాయి. అందమైన హీరో, హీరోయిన్లున్నారు. గతంలో వచ్చిన గీతాంజలి, చక్రం వంటి సినిమాల కథల నుంచే పుట్టిన చిత్రం 180. కానీ దీన్ని వండి వార్చడం కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు మోసిన జయేంద్ర వల్ల కాలేదు. దర్శకుడు పూర్వాశ్రమంలో యాడ్‌ఫిల్మ్ దర్శకుడు కావడం వల్ల కొన్ని సన్నివేశాలను మాత్రం హృద్యంగా చిత్రీకరించగలిగాడు. కెమెరామెన్ బాలసుబ్రమణియం డిజిటల్ టెక్నాలజీ కెమెరావాడి తీసిన కొన్ని సన్నివేశాలు తెరపై చూడాల్సిందే గానీ వర్ణనకు అతీతమైనవి. కాశీలోని గంగానదిని, శవాలు కాలుతుండే హరిశ్చంద్ర ఘాట్‌ను చిత్రీకరించిన తీరు అద్భుతం. ఊదర ఊదు పాటను స్లోమోషన్‌లో చూపిన తీరు బాగుంది. నిశిరాత్రి అమెరికా అందాలు, సెలయేర్లు, భవనాలను మంచి యాంగిల్స్‌లో చూపారాయన. సంగీత దర్శకుడు శరత్ ఊదరఊదు, పిలిచే ఏమో, నీ మాటలో మౌనం చరణాలతో సాగే పాటలకు విలక్షణమైన సంగీతం సమకూర్చాడు. వేకువున పేపర్ బాయ్స్ పాట్లు, వారికి చదువు చెప్పించను ముందుకొచ్చే సంస్థలు, నిత్యమీనన్ తీసే కెమెరా స్టిల్స్, ఆమె ప్రేమను వెల్లడిచేయను పడే ఇబ్బంది, ప్రియా ఆనంద్ భర్తపై చూపే అనురాగం. అతను దూరమవుతాడని తెలిసినప్పుడు పడే ఆవేదనను దర్శకుడు బాగానే చిత్రీకరించినా హాస్యరసం కొరవడడం, ద్వితీయార్థంలో హీరో బేలతనం సినిమాను ధ్వంసం చేసి పారేశాయి. ఏమాయ చేసావె వంటి చిత్రానికి మంచి మాటలు వ్రాసిన ఉమర్జీ అనూరాధ 180లో ఓ మంచి మాట వ్రాయలేక పోవడం పెద్ద లోటుగానే చెప్పుకోవాలి. సరసం, హీరోయిన్‌కు హీరో ముద్దులివ్వడం వంటి సన్నివేశాలు కూడా వుండి అవి జనాన్ని ఆకర్షించలేదంటే పూర్తిగా దర్శకుని చేతకాని తనమేనని చెప్పుకోక తప్పదు.




చిత్ర కథలోనికి వెళ్తే మనో(సిద్దార్థ్) కాశీకి వెళ్లి గంగలో స్నానమాచరించి కొన్ని వస్తువులు నదీ గర్భాన వదలి బయటకు వస్తూ అక్కడ మెట్లపై కూర్చొని వుండే సాధువుకు బంగారు చైన్‌ను దానం చేస్తాడు. సాధువు దీర్ఘాష్మాన్‌భవ అని ఆశీర్వదించగా వింతగా చూస్తాడు. ఇంతలో తండ్రికి కర్మక్రతువులు చేయను వచ్చిన ఓ చిన్నపిల్లవాడు తాను చేస్తున్న కార్యం గూర్చి తెలుసుకోక ఆటలాడు కోవడాన్ని గమనించి మనో రీఛార్జ్ అవుతాడు. అంతే సికింద్రాబాద్‌లోని మారేడుపల్లికి వచ్చి మౌళి, గీత దంపతుల ఇంటిలో బాడుగకు దిగుతాడు. పేపర్ బాయ్స్‌తో కలసి పేపర్లు వేస్తాడు. పార్కులో శనగలు అమ్ముతాడు. కాలువలు క్లీన్‌చేసే పారిశుధ్య సిబ్బందికి టీలు మోస్తూ, క్షురకునికి తాను మసాజ్ చేస్తూ ఫోటో జర్నలిస్ట్ విద్య(నిత్యమీనన్) మనసు దోస్తాడు. ఆమె ఐలవ్‌యు చెప్పే స్థితికి వచ్చేసరికి మరో చోటకు బయలు దేరుతాడు. అతను వెళ్తున్న బస్సు వెనుకనే స్కూటీలో వెంబడించే విద్యకు ఘోర ప్రమాదం జరిగి మెదడు దెబ్బతింటుంది. ఆమెను మెరుగైన వైద్యం కోసం అమెరికాకు తీసుకవెళ్లే సమయంలో మనోకు ఫ్లాష్‌బ్యాక్ గుర్తుకు వస్తుంది.

మనో అమెరికాలోని సన్‌వే మెడికల్ సెంటర్‌లో పెద్ద డాక్టర్. అతని అసలు పేరు డాక్టర్ అజయ్. హాస్పిటల్‌లో పేషెంట్‌గా చేరే తెలుగమ్మాయి రేణు(ప్రియా ఆనంద్) అతని మనసు దోస్తుంది. వీరిద్దరూ పెళ్లి చేసుకొని హనీమూన్ వెళ్లి వస్తుండగా హాస్పిటల్ హెడ్ అతన్ని అర్జెంట్‌గా రమ్మని పిలిచి మెడికల్ రిపోర్ట్స్ ఇస్తాడు. దానిలో డాక్టర్ అజయ్‌కు పాంక్రియాటిక్ క్యాన్సర్ ముదిరినట్లుంటుంది. ఆరు నెలలు బతికితే గొప్ప అంటారు. అది తెలుసుకొని డాక్టర్ అజయ్ సైకోలా మారిపోతాడు. ఇది చూసి భార్య భయవిహ్వాల అవుతుంది. ఒకరోజు ఆస్తి మొత్తం రేణుకు వ్రాసిచ్చి తాను అమెరికాలోనే చనిపోయినట్లు కొంత సాక్ష్యం చూపి ఇండియాలోని కాశీకి వచ్చిన అజయ్ చివరికి అటు భార్యకు ప్రేయసికి దూరంగా జర్మనీకి నిన్న గతం, రేపు అనేది తెలియదంటూ వెళ్లి పోవడంతో సినిమా ముగుస్తుంది.

చిత్రంలో సిద్దార్థ్, నిత్యమీనన్, ప్రియా ఆనంద్ మంచి నటన చూపినా కథకు చావు తిప్పలు రావడంతో ప్రేక్షకులు చూడలేకపోతున్నారు.




## అందాల ఆరబోత చాలదు



సినిమాల్లో హీరోయిన్ అంటే అందాల ఆరబోత కోసమేనని చాలామంది అభిప్రాయం. కాని దీన్నొక్కదాన్నే నమ్ముకొంటే లాభం లేదంటుంది హీరోయిన్ కరీనాకపూర్. ఈ విషయమై వివరిస్తూ కేవలం అందాన్నే నమ్ముకొంటే కొన్ని సినిమాలకే పరిమితమవుతాం. అదే అభినయంపై కూడా దృష్టి సారిస్తే కొన్నేళ్ల పాటైనా కెరీర్ పదిలంగా వుంటుంది. హీరోయిన్ అంటే అందం, అభినయం రెండూ చూపించాలి. నేను బికినీ వేశాను. జీరోసైజు అందాలు ప్రదర్శించాను. నటనలో ఏమాత్రం వెనకడుగు వేయలేదు. కాబట్టి ఇప్పుడు ఏడు చిత్రాలు తన చేతిలో వున్నాయని చెప్పుకొచ్చింది కరీనాకపూర్.

## వివాదంలో కాగుతున్న కాజల్



తెలుగులో నెంబర్‌వన్ హీరోయిన్ స్థానంలో వున్న కాజల్ 'సింగమ్' అనే హిందీ చిత్రంలో నటిస్తుంది. దీనిలో అజయ్ దేవగన్ కథానాయకుడు. ఈ చిత్ర ప్రచారంలో భాగంగా ముంబాయిలో విలేకరులతో ఆమె మాట్లాడుతూ నేను దక్షిణాది నటిగా ఎప్పుడూ ఫీల్ కాలేదు. నేను పంజాబీ యువతిని అంటే ఉత్తరాది యువతినే. ముంబై రావడం అంటే నా పుట్టింటికి వచ్చినట్లుందని చెప్పిందామె. కాజల్ వాఖ్యలు తెలుగు చిత్రసీమలోనే కాదు తమిళంలో కూడా కలకలం రేపాయి. కాజల్ అనే నటి అందరికీ తెలిసింది తెలుగు సినిమాల ద్వారానే కదా? అలాంటిది తానెప్పుడూ దక్షిణాది నటినని అనుకోవడం లేదని ఈమె చెప్పడం సబబా అనేదే ప్రస్తుత వివాదం.

## నిష్టగా నయనతార



ఎన్టీరామారావు పౌరాణిక చిత్రాలు చేసేటప్పుడు ఎంతో నిష్టగా వుండేవారని చెబుతారు. నేల మీద పడుకోవడం, మాంసాహారానికి దూరంగా వుండడం వంటి నియమాలు పాటించేవారని ఈనాటికి పరిశ్రమలో కథలు కథలుగా చెబుతారు. ప్రస్తుతం తెరకెక్కుతున్న భక్తిభావ చిత్రం శ్రీరామరాజ్యంలో తండ్రి బాటలో పయనిస్తూ బాలకృష్ణ శ్రీరామచంద్రుడి పాత్ర పోషించారు. నియమనిష్టల్లోనూ తండ్రిని తలపించారు. బాలయ్య ప్రభావం ఈ సినిమాల్లో హీరోయిన్ నయనతారపై కూడా పడినట్లుంది. శ్రీరామరాజ్యంలో సీతాదేవి పాత్ర పోషించిన ఆమె షూటింగ్ ముగిసే వరకు శాకాహారమే తీసుకోవడంతోపాటు ఆధ్యాత్మికపరమైన ఆలోచనలతో గడిపినట్లు సమాచారం. డ్యాన్సర్ ప్రభుదేవాను పెళ్లి చేసుకొంటుండటంతో ఇక సినిమాల్లో నటించలేనన్న ఆలోచనతో కాబోలు నయనతార చిత్ర యూనిట్ సభ్యులందరికీ షూటింగ్ చివరిరోజు రిస్ట్ వాచీలు కూడా బహుకరించి కన్నీళ్ల పర్యంతమయ్యింది.

## కత్రినా ముద్దాముచ్చట!



హీరో, హీరోయిన్లు సరస సల్లాపాల్లో తేలిపోతూ ముద్దులు కురిపించుకోవడం హిందీ ప్రేక్షకులకు కొత్తేం కాదు. ఇమ్రాన్ హష్మీ ముద్దు సన్నివేశాలతో ప్రభంజనం సృష్టించి ఏకంగా స్టార్‌గా మారిపోయాడు. ముద్దు సన్నివేశాలకు దూరంగా వుండే హీరోయిన్ కత్రినాకైఫ్ ఏకంగా తెరపై మూడు నిమిషాలపాటు ముద్దిచ్చింది. హృతిక్‌రోషన్, కత్రినా జంటగా ఓ చిత్రం తెరకెక్కుతుంది. ఈ చిత్రంలో ఘాటుముద్దు సన్నివేశం వుంది. షూటింగ్‌లో చాలాసేపు చిత్రీకరించిన ఈ ముద్దును చిత్రంలో వుంచాలా వద్దా అనే ధర్మసంకటంలో దర్శక, నిర్మాతలు పడ్డారు. ఆ తర్వాత ఇది కథలో సందర్భానుసారం వచ్చే ముద్దు కాబట్టి యధాతథంగా వుంచాలని ఒక నిర్ణయానికి వచ్చినట్లు తెలిసింది.

## తాగితే తప్పేమిటి?



అందాల హీరోయిన్ శ్రియ ఓ పబ్బులో తాగి తందనాలు ఆడిందనే విషయమై ఈ మధ్య పెద్ద దుమారమే రేగింది. ఈ గొడవ సమసిపోక మునుపే మరో గొడవలో ఆమె తల దూర్చింది. మద్యం సేవించాలంటే కనీసం 25 ఏళ్లు నిండి వుండాలని మహారాష్ట్ర ప్రభుత్వం ఈ మధ్య జి.వో జారీ చేసింది. దీనిపై శ్రియ మాట్లాడుతూ దేశాన్ని పరిపాలించే నేతలను ఎన్నుకొనేందుకు అవసరమైన ఓటు వేయను 18 సంవత్సరాలు నిండితే చాలు. మరి మద్యం తాగను 25 ఏళ్ల వరకు ఎందుకు ఆగాలి. మేజర్లను మద్యం తాగకుండా ఎవరూ ఆపలేరని శ్రియ చెప్పడం విన్న వారంతా ముక్కున వేలు వేసుకొన్నారు.

## స్కూళ్ల నిర్వాహకుల మధ్య లడాయి

### ఎప్పటికి పరిష్కారమయ్యేనో?

పిట్టపోరు, పిట్టపోరు పిల్లి తీర్చిన చందంగా వుంది జిల్లాలో గుర్తింపులేని పాఠశాలల విషయంలో రెండు ప్రైవేటు పాఠశాలల అసోసియేషన్ల వ్యవహరిస్తున్న తీరు. పేరొందిన కార్పొరేట్ సంస్థల నుంచి చిన్న చిన్న విద్యాసంస్థల వరకు పలువురు ప్రభుత్వ గుర్తింపు లేకుండానే పాఠశాలలను అన్ని హంగులతో నిర్వహించడంతోపాటు పిల్లల వద్ద నుంచి భారీగా ఫీజులను వసూలు చేస్తున్నాయి. ఈ పరిస్థితులలో గుర్తింపులేని పాఠశాలలను మూసివేయాలని కోరుతూ ప్రైవేట్ విద్యా సంస్థలకు చెందిన రెండు అసోసియేషన్లు పోటాపోటీగా పోరాటం చేస్తున్నాయి. కొన్ని చోట్ల విద్యా సంస్థలను మూసివేయిస్తుండగా, మరికొందరు ఇంజనీరింగ్ కళాశాలలు నిర్వహిస్తూ క్రొత్తగా పాఠశాలలు నెలకొల్పే వాళ్లు మేము ప్రభుత్వానికి దరఖాస్తు చేసుకొని వున్నామని మాది అంతా సక్రమమే అంటుండగా, మరికొన్ని విద్యాసంస్థలు అబ్బే అసలు మాది పాఠశాల కాదు. ట్యుటోరియల్స్ అంటూ బుకాయిస్తుండడం వివాదమవుతోంది. ట్యుటోరియల్స్ అనగా ట్యూషన్స్ మాదిరి. వీటిని ఉదయం తొమ్మిది గంటల వరకు, సాయంత్రం ఐదు గంటల నుంచి మాత్రమే నిర్వహించాలి. పాఠశాలల సమయాల్లో తెరవరాదు. ఖరీదైన ప్రాంతాల్లో, డాక్టర్లు, వ్యాపారవేత్తల ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న విద్యాసంస్థలు తీరుపై ఇలా అధికారులకు తప్పుడు సమాచారం ఇవ్వడం, దానిపై వారు విచారణ జరపకపోవడంపై సర్వత్రా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. గుర్తింపులేని పాఠశాలలపై పోరు సల్పుతున్న విద్యాసంస్థలకు హామీ ఇస్తున్న అధికారులు, అలాంటి హామీని గుర్తింపులేని పాఠశాలల యాజమాన్యాలకు ఇవ్వడంపై విద్యాశాఖాధికారితో జరిగిన సమావేశంలో ఈ విషయమై కర్తం ప్రతాప్‌రెడ్డి, మనోహర్‌రెడ్డి, సుబ్బారెడ్డి, చాట్ల నరసింహారావు తదితరులు డిఇఒ రామలింగాన్ని నిలదీసినట్లు సమాచారం. మొత్తం మీద విద్యాశాఖ సిబ్బందికి గుర్తింపు వివాదం అయాచితవరంగా మారడంతో వసూళ్లు అధికం అయ్యాయట.



ట్రాఫిక్‌ను పరిశీలిస్తున్న ఎస్పీ రమణకుమార్.

## ట్రాఫిక్‌పై ఎస్పీ దృష్టి!

జిల్లా ఎస్పీగా బాధ్యతలు చేపట్టిన రమణకుమార్ నగరంలోని ట్రాఫిక్‌పై దృష్టి సారించారు. నిత్యం నగర ప్రజలకు ట్రాఫిక్ నరకం చూపిస్తుంది. దీనిని నియంత్రించేందుకు తీసుకోవాల్సిన జాగ్రత్తలపై ఆయన నగరంలో పర్యటిస్తున్నారు. ట్రాఫిక్ సిఐలు, ఎస్ఐలతో సమీక్ష సమావేశం నిర్వహించి ఏ ప్రాంతంలో ప్రధానంగా రాకపోకలు స్తంభిస్తున్నాయో అడిగి తెలుసుకోవడంతోపాటు రాత్రి సమయంలో ఎస్పీ స్వయంగా వెళ్లి పరిశీలిస్తున్నారు. ట్రాఫిక్ సమస్యను పరిష్కరించాలని ఎస్పీ భావిస్తున్నా అందుకు ప్రత్యామ్నాయ ఏర్పాట్లు కనిపించడం లేదు. పెరుగుతున్న జనాభాతోపాటు వాహనాల రద్దీ అధికమవుతుంది. అయ్యప్పగుడి నుంచి గాంధీబొమ్మ వరకు వచ్చేందుకు ఒకే రహదారి వుండడం, రోడ్ల ఆక్రమణలు తొలగించక పోవడంతో నిత్యం ట్రాఫిక్ స్తంభించి పోతుంది. మరోప్రక్క రోడ్డుకు ఇరువైపులా నిర్మించి వున్న షాపులకు పార్కింగ్ సదుపాయం లేకపోవడంతో రోడ్డుపైనే వాహనాలను పార్కింగ్ చేయాల్సి వస్తుంది. ఇంతకు ముందు ఎస్పీలుగా పని చేసి బదిలీపై వెళ్లిన వారందరూ కూడా ట్రాఫిక్ సమస్యను పరిష్కరించాలని ప్రయత్నించి విఫలం చెందారు. కొత్త ఎస్పీ ఎటువంటి విధానాన్ని అవలంభిస్తారో వేచి చూడాలి.

## ఎన్నికలకు సిద్ధం కండి!




బిజెపి పదాధికారుల సమావేశంలో ఆ పార్టీ నాయకులు ఆంజనేయరెడ్డి, సురేష్‌రెడ్డి, భానుప్రకాష్‌రెడ్డి తదితరులు.

బిజెపి పదాధికారుల సమావేశం నెల్లూరులోని పార్టీ కార్యాలయంలో జిల్లా అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి అధ్యక్షతన జరిగింది. ఈ సందర్భంగా ఆంజనేయరెడ్డి మాట్లాడుతూ స్థానిక సంస్థల ఎన్నికల్లో ప్రజాభిమానం పొంది గెలిచేందుకు బిజెపి కార్యకర్తలు సిద్ధం కావాలన్నారు. ప్రజలు రకరకాల ఇబ్బందులు పడుతున్నారు. వాటిని బిజెపి క్యాడర్ గుర్తించి పరిష్కార మార్గాలు చూపి ప్రజాభిమానం పొందాలన్నారు. జిల్లాలో దొంగతనాలు, దోపిడీలు, క్రికెట్ బెట్టింగులు, పేకాట ఎక్కువయ్యాయన్నారు. వీటిని నిలువరించే బాధ్యతను కొత్తగా వచ్చిన ఎస్పీ స్వీకరించాలన్నారు. రాష్ట్రంలో ఈ రోజు బిజెపి అధికారంలో లేకపోవచ్చు. దేశంలో పది రాష్ట్రాలలో పార్టీ అధికారంలో వుంది. సిద్ధాంతం, క్రమశిక్షణలో పార్టీ కార్యకర్తలు ముందుకు సాగితే అనూహిత విజయాలు సాధ్యమేనన్నారు. ఆగష్టు నెల 5, 6, 7 తేదుల్లో నెల్లూరులో బిజెపి కార్యకర్తల శిక్షణా తరగతులకు పార్టీ కేంద్ర, రాష్ట్ర నాయకులు తరలివస్తారన్నారు. బిజెపి రాష్ట్ర అధికార ప్రతినిధులు సన్నపురెడ్డి సురేష్‌రెడ్డి, బి.భానుప్రకాష్‌రెడ్డి, పనబాక కోటేశ్వరరావు, పి.సురేంద్రరెడ్డి, మిడతల రమేష్, మండ్ల ఈశ్వరయ్య తదితర నేతలు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

● నెల్లూరులో

## ఊపందుకొన్న సమైక్య నినాదం!




ర్యాలీలో తెలుగుదేశం నేతలు చంద్రమోహన్‌రెడ్డి, రమేష్‌రెడ్డి, శ్రీనివాసులురెడ్డి తదితరులు.

సింహపురి నగరం సమైక్య నినాదంతో దద్దరిల్లింది. తెలుగుదేశం పార్టీ నేతలు, కళాకారులు, ముస్లిం జెఎసి ప్రతినిధులు జై సమైక్యాంధ్రంటూ నినదించిన నినాదాలతో హోరెత్తింది. జూలై 9వ తేది తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యంలో ఆంధ్ర రాష్ట్రాన్ని ముక్కలు చేయరాదని, సమైక్యాంధ్ర కావాలంటూ నగరంలో భారీ ర్యాలీ నిర్వహించారు. టిడిపి జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఆధ్వర్యంలో తెలుగుదేశం శ్రేణులు వి.ఆర్ కళాశాల వద్ద గల అంబేద్కర్ విగ్రహం వద్దకు చేరుకొని మానవహారంగా ఏర్పడ్డారు. ఈ సందర్భంగా సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మాట్లాడుతూ తెలంగాణ ప్రకటిస్తే తీవ్ర పరిణామాలు వుంటాయని హెచ్చరించారు. కొందరు కాంగ్రెస్ పార్టీ నేతలు, జైపాల్‌రెడ్డి, కొంతమంది మంత్రులు తమ పదవులు కాపాడుకొనేందుకు కుయుక్తులు పన్నుతున్నారని విమర్శించారు. శ్రీ కృష్ణ కమిటీ సూచనలకు అనుగుణంగా రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచాలని డిమాండ్ చేశారు. అవసరమైతే సుప్రీంకోర్టు సిట్టింగ్ జడ్జిచేతనైనా విచారణ జరిపించుకొన్నా అందరూ సమైక్యాంధ్రానే కోరుకొంటారని తెలిపారు. కళాకారులు సమైక్యాంధ్రను కాంక్షిస్తూ భారీ ర్యాలీని నిర్వహించగా, ముస్లిం జెఎసి సైతం సమైక్య నినాదాన్ని విన్పించింది. జెఎసి కన్వీనర్ ముష్తీ మహమ్మద్ ఇలియాస్ తదితరులు రాష్ట్రం సమైక్యంగా వుంటేనే అభివృద్ధి సాధ్యమవుతుందన్నారు.

## క్రీడలతో మానసిక ఉల్లాసం



క్యారమ్స్ పోటీలను ప్రారంభిస్తున్న అమరావతి కృష్ణారెడ్డి.

క్రీడలు మానసిక ఉల్లాసాన్ని, ప్రశాంతతను కలుగజేస్తాయని రాష్ట్ర హోటళ్ల అసోసియేషన్ ఉపాధ్యక్షుడు అమరావతి కృష్ణారెడ్డి చెప్పారు. 8వ తేది దొడ్ల పద్మావతమ్మ మహిళా గ్రంథాలయంలో జిల్లా స్థాయి క్యారమ్స్ పోటీలను ఆయన ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ జాతీయ స్థాయి క్యారమ్స్ పోటీల్లోనూ నెల్లూరీయులు పాల్గొనేందుకు ఈ పోటీలు ఎంతగానో దోహదపడుతున్నాయన్నారు. ప్రభుత్వం క్యారమ్స్ పోటీలలో విజేతలను ప్రోత్సహిస్తే బాగుంటుందన్నారు. ఈ కార్యక్రమంలో పోటీల నిర్వాహకుడు ఎ.గజేంద్ర, ఫిల్మ్ డిస్ట్రిబ్యూటర్స్ అసోసియేషన్ అధ్యక్షుడు ఎ.నాగిరెడ్డి, దోర్నాల హరిబాబు, ఎన్.సుధాకర్‌రెడ్డి పలువురు క్రీడాకారులు పాల్గొన్నారు.

## వైశ్య విద్యార్థులకు ప్రతిభా పురస్కారాలు!

ప్రభుత్వ హైస్కూళ్లలో పదవ తరగతి చదివి 500ల కంటే ఎక్కువ మార్కులు తెచ్చుకొన్న ఆర్యవైశ్య విద్యార్థులకు స్టోన్‌హౌస్‌పేటలోని శ్రీ పాండురంగ అన్నదాన సమాజం ప్రతిభా పురస్కారాలు ఇవ్వ సంకల్పించింది. 500లకు పైగా మార్కులు వచ్చిన విద్యార్థులు మార్కుల లిస్ట్, ఫోటోతో దరఖాస్తు నింపి జూలై 31వ తేదీలోగా సమాజం కార్యాలయంలో ఇవ్వాలని అధ్యక్షుడు తవ్వా రంగయ్య తెలియజేస్తున్నారు. ఈ ప్రతిభా పురస్కారాలను ఆగష్టు 15వ తేది ఇస్తారు.

## జగన్‌కు మేలు?

మొదటి పేజీ కొరవ

కొందరి వాదన. కానీ ఈ రెండు అంశాలకు ప్రధానమైన తేడా వుంది. కనిమొళి, 2జి స్పెక్ట్రం కుంభకోణం పాత్రధారుల నుంచి డబ్బు తీసుకొన్నది. ఆ కుంభకోణంపై విచారణ కోసం తీగ లాగినప్పుడు ఆమె దొరికిపోయింది. కానీ జగన్ కంపెనీలలో పెట్టుబడి పెట్టిన పారిశ్రామికులెవరూ అటువంటి కుంభకోణంలో లేరు. శంకరరావు కూడా జగన్ కంపెనీలలోపెట్టుబడి పెట్టారని ఆరోపించాడే కానీ, చట్టవిరుద్ధంగా ప్రభుత్వ ఆస్తులను వశం చేసుకొని కుంభకోణానికి పాల్పడ్డారని ఆ పారిశ్రామికుల మీద ఆరోపణలు చేయలేదు.

### పెట్టుబడులు తప్పు కాదు

వారు ప్రభుత్వం నుంచి పొందిన ప్రయోజనాలు తప్పు కానప్పుడు, వారు పెట్టిన పెట్టుబడులలో కూడా సాంకేతికంగా తప్పున్నది వుండదు కదా? జగన్ కంపెనీలలోనే ఎందుకు పెట్టుబడి పెట్టారన్న ప్రశ్న అడగడానికి ఎవరికీ అధికారం లేదు. ఏ పారిశ్రామికవేత్త అయినా తన ఇష్టం వచ్చిన చోట పెట్టుబడి పెట్టే హక్కు రాజ్యాంగం ప్రసాదించింది. ఆ పెట్టుబడి కోసం వాడిన డబ్బు అక్రమమా, సక్రమమా అన్నది మాత్రమే పరిశీలన చేసే అధికారం కోర్టులకు వుంటుంది. పెట్టుబడులన్నీ వైట్ మనీ రూపంలో పెట్టారు కాబట్టి, వాటికి ఇన్‌కంటాక్స్ లెక్కలు సమర్పించారు కాబట్టి, అవి అక్రమమని ఎవరూ నిరూపించలేరు. వైఎస్ నుంచి వీరు తీసుకొన్న భూములు, గనులు తప్పుడు తనంతో జరిగిందని, అందులో కుంభకోణం నడిచిందని నిరూపించగలిగినప్పుడు మాత్రమే, నేరం అవుతుంది. కానీ శంకరరావు లేఖలో కానీ, హైకోర్టు విచారణలో కానీ, సిబిఐ దర్యాప్తులో కానీ ఆ ప్రయోజనాలను కుంభకోణంగా నిర్ధారించే ప్రయత్నం లేదు. అందువల్ల ఈ పెట్టుబడులను ప్రశ్నించే న్యాయపరమైన అవకాశం హైకోర్టుకు కూడా వుండదు.

### ధర నిర్ణయం ప్రశ్నించలేరు

సాక్షిలో జగన్‌కు 90శాతం వాటా వుంటే, ఆయన పెట్టుబడి కేవలం 70 కోట్ల రూపాయలు; కానీ అందులో మిగిలిన 10శాతం వాటా తీసుకొన్న పారిశ్రామికుల పెట్టుబడి 300 కోట్ల రూపాయలని శంకరరావు ఆరోపణ. ఏ కంపెనీలోనైనా, దాన్ని ప్రారంభించినవారు తమకు నచ్చిన ధరకు షేర్లు అమ్మే హక్కు వుంది. అంతకెందుకు అమ్మావు అని దాని యజమానిని కానీ, అంతకెందుకు కొన్నావని కొన్న వాడిని కానీ అడిగే అధికారం ఎవరికీ లేదు. అది అమ్మేవాడి, కొనేవాడి ఇష్టమే తప్ప, చట్టవ్యతిరేకం అంటూ వుండదు. అందువల్ల హైకోర్టు ఆదేశాలు వచ్చిన తర్వాత కూడా జగన్ అంత నిబ్బరంగా వుండగలుగుతున్నాడు.

### హవాలా వుంటే ప్రమాదం

అయితే జగన్ తన కంపెనీలలో తన పెట్టుబడిగా పెట్టిన సొమ్ము ఎక్కడ నుంచి వచ్చిందన్నది మాత్రం పరిశీలనకు వస్తుంది. ఆయన తన పెట్టుబడుల కోసం తామరతంపరగా కొత్త కొత్త కంపెనీలు సృష్టించాడు. కొన్ని కలకత్తాలో పుట్టుకొస్తే, మరికొన్ని మారిషస్ వంటి దేశాలలో పురుడు పోసుకున్నాయి. ఆ కంపెనీలు వేటిలోనూ జగన్ పేరు లేదు. కానీ అవన్నీ జగన్ తరపున ఆయన కంపెనీలలో పెట్టుబడులు పెట్టాయి. అంటే, లంచాల రూపంలో తనకు వచ్చిన కోట్లాది రూపాయల నల్లధనాన్ని ఇతరత్రా కంపెనీలలోకి, ఇతర దేశాలకు ప్రవహింపచేసి, తిరిగి తెల్లధనంగా తన స్వంత కంపెనీలలోకి తెప్పించుకొన్నాడన్న మాట. రాజకీయవాదులు, పారిశ్రామికులు సహజంగా చేసే పని ఇది. అయితే ఇతర దేశాల నుంచి వచ్చిన పెట్టుబడులకు మూలం వెతకడంలో, ఇక్కడ జగన్ నుంచి హవాలా మార్గంలో అక్కడకు నల్లధనం ప్రవహించిందని తేలితే మాత్రం జగన్ చిక్కుల్లో పడక తప్పదు. హవాలా అనేది, చట్టపరంగా నేరం. దానికి శిక్ష కఠినంగా వుంటుంది. నల్లధనం రారాజుగా పేరొందిన హసన్ అలీని జైలులో పెట్టడానికి కేంద్ర ప్రభుత్వం చూపించిన కారణం ఈ హవాలా పద్ధతులే. కేవలం నల్లధనం మాత్రమే వుంటే, పెద్ద నేరం కాదు. అది వైట్ కాలర్ క్రైం క్రిందకు వస్తుంది. ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంటు పరిశీలన చేసి, భారీ మొత్తంలో విధించే పన్నులను చెల్లిస్తే, ఆ పాపం పరిహారం అవుతుంది. కానీ హవాలా మార్గంలో ఇతర దేశాలకు నల్లధనాన్ని మార్పిడి చేస్తే మాత్రం పెద్ద నేరంగా శిక్ష అనుభవించక తప్పదు. కానీ తన కంపెనీల స్థాపన, నిర్వహణలో జగన్ చూపిన అమోఘమైన మేధస్సును బట్టి చూస్తే, ఆయన అంత సులభంగా హవాలా నేరంలో ఇరుక్కొంటాడా అన్నది సందేహం. చేసేది తప్పుడు పని అయినా, తెలివిగా చేస్తే ఒప్పుగా మారిపోతుంది. ఆ మాత్రం తెలివిలేనివాడు కాదు జగన్. రాజకీయంగా ఆయన్ను దెబ్బతీయడానికి సిబిఐ ఏదో ఒక రూపంలో కేసులు ఇరికించవచ్చు కదా అనే వాదన వుంది. దానిలో చాలా ఇబ్బందులున్నాయి. జగన్ సంపాదన మొత్తం అవినీతి సొత్తని రాష్ట్ర ప్రభుత్వం కానీ, కేంద్ర ప్రభుత్వం కానీ కేసులు పెడితే, వైఎస్ కాలంలో నడిచిన ఆరేళ్ళ కాంగ్రెస్ ప్రభుత్వం అవినీతిపరురాలని ఒప్పుకోవాలి. అంత సాహసం కాంగ్రెస్ నేతలెవరికీ లేదు. వైఎస్ చాలా గొప్పవాడని ఒకపక్క కీర్తనలు చేస్తూ, ఆయన పాలన ఎలా అవినీతిమయమంటారు.

### ఏది జరిగినా జగన్‌కే మేలు

ఈ కేసు వల్ల జగన్‌కు జరిగే నష్టం కంటే, కలగనున్న మేలే ఎక్కువని న్యాయనిపుణులు భావిస్తున్నారు. హైకోర్టు పరిశీలనలో చట్టవిరుద్ధమైనదేదీ లేదని తేలితే, ఇక నుంచి జగన్ దోపిడీ దారుడని నిందించే అవకాశం రాజకీయ ప్రత్యర్థులు కోల్పోతారు. ఆయనకు కోర్టు నుంచి క్లీన్ సర్టిఫికేటు వస్తే, ఎట్లా చెలరేగిపోతాడో వూహించుకోవచ్చు. ఒకవేళ ఏదో ఒక తప్పు వెతికి జైలుకు పంపే పరిస్థితి వస్తే, కాంగ్రెస్ ప్రభుత్వం తనపై కక్ష సాధిస్తున్నదని ప్రజలలో ప్రచారం చేసి, సానుభూతి పొందే ప్రయత్నం చేస్తాడు. మన ప్రజలు ఎంత గొర్రెలో తెలిసిన సంగతే. తాము అభిమానించే నేత, ఎన్ని తప్పులు చేసినా వారికి ఒప్పులుగానే కనపడతాయి. వారిలో జగన్ పట్ల అయ్యోపాపం అనే మాట పుడితే, ఇక రాజకీయంగా జగన్‌కు అడ్డు ఆపు వుండదు. ఏది ఏమైనా హైకోర్టు కేసు జగన్ జీవితంలో ఒక కీలక పరిణామం. దాన్ని ఆయన ఎట్లా ఎదుర్కొంటాడో వేచి చూద్దాం.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### వాస్తు రామచంద్ర ఎన్నిక

నెల్లూరు సమాచార హక్కు సామాజిక పర్యవేక్షణ సమితి గౌరవాధ్యక్షునిగా వాస్తు రామ చంద్రను ఎన్నుకొన్నారు. ఉత్తరాలు వ్రాసే ఓపిక ఎక్కువ కాబట్టి రామచంద్ర ఈ పదవికి తగిన వ్యక్తని చెప్పొచ్చు.

## మార్కెట్ స్థలం

16వ పేజీ కొరవ

సరఫరా జరిగేది. మత్స్యశాఖ దీన్ని నిర్వహించేది. ఆ తర్వాత, దానికి ఆనుకొని ఒక ఐస్ ఫ్యాక్టరీ కట్టారు. మద్రాసు బస్టాండ్‌ను తొలగించి, ఆ స్థానంలో మార్కెట్ నిర్మించినప్పుడు ఐస్ ఫ్యాక్టరీ కూడా మూతపడింది. అప్పటి నుంచి కోనేరు పాడుపడిపోయింది. కొంతకాలం తర్వాత, మార్కెట్ ఇరుకైపోవడంతో ఈ స్థలాన్ని తమకిస్తే, మార్కెట్‌ను విస్తరించుకొంటామని మార్కెటింగ్ కమిటీ వారు మత్స్యశాఖను కోరారు. వారందుకు అంగీకరించారు. ఆ వెంటనే నగరంలోని మునిసిపల్ చెత్తా చెదారంతో కోనేటిని పూడ్చించి, నిర్మాణానికి సిద్ధం చేశారు. అప్పుడే ఆనం సోదరుల కళ్ళు దీని మీద పడ్డాయి. మార్కెట్ విస్తరణ పనులు జరగకుండా నిలిపి వేయించారు. పదేళ్లుగా ఖాళీగా పెట్టారు. వైఎస్.రాజశేఖర్ రెడ్డి ముఖ్యమంత్రిగా వున్న సమయంలో స్థానిక డాక్టర్లు ఇద్దరి చేత ఈ స్థలం కోసం దరఖాస్తు చేయించారు. వైఎస్ తమ మాట వినకపోవడంతో, ఓబుళాపురం మైనింగ్ యజమాని గాలి జనార్ధన రెడ్డి చేత సిఫార్సు చేయించారు. ఆ ఒత్తిడికి తలొగ్గిన వైఎస్, ఫైల్ ముందుకు కదిలించాడు. కానీ ఎన్నికలు రావడంతో అది నిలిచిపోయింది. ఎన్నికల తర్వాత దీనిపై వైఎస్ ఆసక్తి చూపలేదు.

ఇంతకాలం తర్వాత, ఇప్పుడు ప్రభుత్వంలో తమ మాట బాగా చలామణి అవుతుందన్న నమ్మకంతో మళ్లీ ఈ దుష్ట ప్రయత్నానికి శ్రీకారం చుట్టారు. స్టోన్‌హౌస్‌పేటకు చెందిన ఇద్దరు వైశ్యుల పేరుమీదుగా మార్కెటింగ్ మంత్రికి ఒక దరఖాస్తు పెట్టించారు. ఈ కోనేరు స్థలంలో తాము రెండు కోల్డ్ స్టోరేజ్‌లు కట్టి, మార్కెట్‌కు వచ్చే కూరగాయలు నిలువ చేసుకొనే సదుపాయం కల్పిస్తామన్నది ఆ దరఖాస్తు సారాంశం. దానిపై మార్కెటింగ్ శాఖ ఆ ఫైలును శరవేగంతో నడిపింది. రెండు కోల్డ్ స్టోరేజ్‌లు కట్టడానికి చెరొక 450 అంకణాల స్థలాన్ని 33 సంవత్సరాలకు లీజుకు ఇచ్చేట్లు, ఆ తర్వాత యజమానులు కోరితే మరొక 33 సంవత్సరాలు లీజు పరిమితి పొడిగించేట్లు ఫైలు సిద్ధం చేశారు. ప్రిన్సిపల్ సెక్రటరీ రత్నకిషోర్ ఆ ఫైలును సర్కులేషన్‌లో పెట్టాడు.

అన్నీ అనుకొన్నట్లు జరిగి వుంటే, ఈపాటికి ఆ స్థలం ఆనం సోదరుల ఖాతాలో జమ అయిపోయేది. కానీ ఈ దశలో సమాచారం బయటకు పొక్కడంతో 'జమీన్‌రైతు' పత్రిక తరపున ముఖ్యమంత్రికి ఫిర్యాదు చేయడం జరిగింది. దానిపై ముఖ్యమంత్రి వెంటనే స్పందన చూపి, ఫైలుకు బ్రేక్ వేశాడు. అదే సమయంలో ఈనాడు విలేఖరికి విషయం తెలిసి, ప్రిన్సిపల్ సెక్రటరీ స్థాయిలో ధృవపరచుకొని మరీ వార్త ప్రచురించాడు.

కోనేరు స్థలం మొత్తం విస్తీర్ణం ఎకరా అరవై సెంట్లు. అంటే 960 అంకణాలు. ఆ ప్రాంతంలో అంకణం ధర 10 నుంచి 15 లక్షల రూపాయల వరకు పలుకుతున్నది. అంటే దీని విలువ 100 కోట్ల రూపాయల పైమాట. అంత పెద్ద మొత్తంలో ప్రజల ఆస్తిని తమ పరం చేసుకోవాలన్న ప్రయత్నం విఫలమైందన్న అక్కసుతోనే వివేకానందరెడ్డికి పిచ్చి పట్టింది.

ఇక అది ఏటూ తమకు దక్కదని నిర్ధారణ కావడంతో, వివేకానందరెడ్డి ప్లేట్ ఫిరాయించాడు. తాము నీతిపరులమని చెప్పుకోవడానికి ఈ స్థలంలో ఆకు కూరలమ్ముకొనే వారికి షెడ్లు నిర్మిస్తామని ప్రకటించాడు.

ఆ పనేదో గత ఆరేడేళ్లలో ఎందుకు చేయలేక పోయాడో, మార్కెట్ విస్తరణ ఇంతకాలం ఎందుకు నిలిచిపోయిందో వివేకానందరెడ్డి చెప్పడు. అది చెప్పాలంటే ఇంతకాలం ఆ స్థలం కోసం గుంటకాడ నక్క వలె తాను కాచుకొని వున్నానని ఒప్పుకోవాలి. ఇప్పుడది జరగదని తెలిసిపోయింది కాబట్టి, అందని ద్రాక్ష పుల్లన అన్నట్లు నీతి వాక్యాలు వల్లిస్తున్నాడు.

ప్రజల ఆస్తులను ఇంత దుర్మార్గంగా దోచుకోవాలని చూసే దుష్టబుద్ధి ఎమ్మెల్యేలు, మంత్రులకు కలగడం దురదృష్టకరం. ఇటువంటి బందిపోట్లను ప్రజా ప్రతినిధులుగా చూడవలసి రావడం కంటే ప్రజలకు వేరొక శాపం వుండదు.

## జనవాణి

2వ పేజీ కొరవ

వాళ్లో గంధపు చెక్కలతో చేసిన పాదుకలు ధరించి కనపడేవారు. బంగారు పాదుకలు భక్తులిచ్చినవి. బాబా సిద్ధిపొందిన ఏప్రెల్ 24తేదీ ఆకాశంలో కనిపించిన నెలవంక ఆయన దైవాంశసంభూతుడని లోకానికి చాటి చెప్పింది. బాబా విషయంలో ఇంత కంటే వేరే నిదర్శనాలే అనవసరం.

పి.ఆదిలక్ష్మి నెల్లూరు

### ఎక్స్‌పైరీ డేటు ముద్రించరాదు

జూన్ 24తేదీ 'జమీన్‌రైతు' సంచిక జనవాణి శీర్షికలో బి.వి.రాజు కరెన్సీనోట్లపై ఎక్స్‌పైరీ డేటు ముద్రించాలని సూచించారు. వెయ్యి, ఐదువందల నోట్ల చలామణి ఉపసంహరించమన్నారు. అమెరికాలో ఒక మిలియన్ డాలరు కూడా చలామణిలో వున్నది. మన దేశంలో వెయ్యి రూపాయల నోటు చలామణిలో లేకుంటే ఎలా? కరెన్సీపై వినియమ తేదీని ముద్రిస్తే చాలా సమస్యలు ఉత్పన్నమవుతాయి. చాలా మంది డబ్బు శాశ్వతం కాదంటారు గానీ అది అవాస్తవం. బీదలు, మధ్యతరగతీయులు, వుద్యోగులు కష్టార్జితాన్ని దాచిపెట్టుకొంటారు. అత్యవసర పరిస్థితులలో ధనాన్ని వినియోగించాలను కొన్నప్పుడు ఎక్స్‌పైరీ డేటు వుంటే సమస్యలు వుత్పన్న మవుతాయి. ప్రపంచంలో ఏ కరెన్సీపై లేని ఎక్స్‌పైరీ డేటు అభివృద్ధి చెందుతున్న మనలాంటి దేశంలో అనవసరం.

రావూరి సురేంద్రనాథ్ నెల్లూరు

**In the Court of the Ist Addl. District Judge, Nellore**

**G.OP.No.368/2011**

(In the matter of Estate of minor Kumari Kuppuru Mounika Sri D/o Late Kuppuru Rama Krishna Kumar, Hindu, aged 6 years, represented by her maternal Grand mother and guardian Smt.Ganta Narayanamma W/o Late Annaiah)

Ganta Narayanamma... Petitioner

Vs

Nill... Respondent

**జనరల్ నోటీసు**

పై నెంబరున మైనరు అయిన **కుప్పూరు మౌనికశ్రీ** D/o **లేట్ కుప్పూరు రామక్రిష్ణకుమార్** తాలూకు ఈ క్రింది షెడ్యూలు దాఖలా ఆస్తిని మైనరుకు అమ్మమ్మ అయిన శ్రీమతి **గంటా నారాయణమ్మను** గార్డియన్‌గా అపాయింట్ చేసి షెడ్యూలు దాఖలా ఆస్తిని మైనరు తరఫున అమ్మటకు పర్మిషన్ ఇప్పించమని కోరుతూ పైకోర్టులో పై పిటిషనరు G.OP.No.368/2011ను దాఖలు చేసి యున్నందున సదరు పిటిషన్ గురించి ఎవ్వరికైనా ఆక్షేపణలు వున్న యెడల తే21-7-2011దిన ఉదయం 10-30 గంటలకు పై కోర్టులో హాజరై ఆక్షేపణలు తెలుపుకోవలసినది. లేని యెడల కేసు పరోక్షమున తీర్మానించబడును.

**షెడ్యూలు**

Nellore Registration District - Nellore Sub - Registration - At present Sri Potti Sreeramulu Nellore Registration - Nellore Sub Registration - Nellore Municipal Corporation - Nellore City, Ramamurthy Nagar, old municipal ward No.16, Door No.1746, New municipal ward No.16-III, Door No.589. an extent of 27 ankanams or 180.603 sq.mts of site and structures therein.

Bounded by: East: Own compound wall of this house adjacent to house and site of T.V.Ramana Reddy. South: Own compound wall of this house adjacent to house and site of Sarvepalli Radha Krishnaiah. West: Municipal Road. North: Own compound wall of this house adjacent to house and site of Pamula Sarojanamma.

An extent of 27 ankanams or 180.603 sq.mts., of site and structures therein with the above referred boundaries with all its easementary rights.

**పెనుబాక గంగాధర్‌రెడ్డి,** B.Com., B.L.,

పిటిషనరు తరఫు అడ్వకేటు, నెల్లూరు.

● కస్తూరిదేవి

# విద్యాలయం ఆత్మ కనకమ్మ గారు!

(గతవారం కొరవ)

కస్తూరిదేవి విద్యాలయం మొట్టమొదటి హెచ్‌ఎం మేరీనాయుడు. అథెంటిక్‌గా వుండేవారు. ఇం ప్రెసివ్ పెర్సనాలిటీ. దడదడలాడించేవారు. ఆమె తర్వాత ఎమ్మీ అయ్యారు. మా ఉపాధ్యాయినులు హేమ లతమ్మ అన్నపూర్ణమ్మ, సుశీలమ్మ గార్ల పేర్లు అచ్చులో చూసి చాలా సంతోషించాను.

తిక్కవరపు రామిరెడ్డి గారు గుర్రపు కోచీలో దర్జాగా వచ్చేవారు. మంచి ఠీవి, దర్పం. జమీన్‌రైతు రామానా యుడు గారు రోజూ వచ్చిపోతుండే వారు. కనకమ్మ గారికి చాలా పలుకుబడి వుండేది. ఎం.ఎస్.సుబ్బలక్ష్మి గారి గాత్రకచేరి, ఆమె కుమార్తె రాధ భరతనాట్యం – ఘంటసాల వెంకటేశ్వరరావు గారి పాటకచ్చేరి(నేను

## పుస్తకసమీక్ష

**కనక పుష్యరాగం**

(పొణకా కనకమ్మ స్వీయచరిత్ర)

సంపాదకుడు : **డాక్టర్ కాళిదాసు పురుషోత్తం**

సమీక్షకురాలు : **ఎం.ఎస్.వరలక్ష్మమ్మ**

**ప్రతులకు**

ప్రభవ పబ్లికేషన్స్

పొగతోట, నెల్లూరు.

వెల : **225రూ/-**

పేజీలు : **272**

టిక్కెట్లు అమ్మాను), లలిత, పద్మిని, రాగిణి భరత నాట్య ప్రదర్శన, ఫన్ డాక్టర్ చంద్రశేఖరం గారి మిమిక్రీ, వెంట్రిలోక్విజమ్, జానకి గానం, ఎన్టీఆర్ బృందం రాక – ఇవన్నీ మాకు చాలా ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని కలిగిం చేవి. వాళ్లను దగ్గరలో వుండి చూస్తూ తన్మయులమై పోయే వాళ్లం. అదో పండుగ వాతావరణం. ఆత్రేయ హాస్టల్లో ఒక రూంలో వుంటూ ఎక్కువ కాలం గడిపే వారు. ఆయన నాటకాలు 'గౌతమ బుద్ధ', 'అశోక', 'మాయ'... స్వయంగా డైలాగులు నేర్పించి రిహార్సల్స్ చేయించి స్కూలు యానివర్సరీలో ప్రదర్శిస్తే అందరి మన్ననలూ పొందేవి.

ఇలా మా విద్యార్థినుల జీవితం సంతోషంగానూ, వైవిధ్యంగానూ, ఉల్లాసంగా గడిచి పోయింది. దీనికంత టికీ ముఖ్య కారణం కనకమ్మగారే.

జమీందారి వ్యతిరేక ఉద్యమంలో ప్రముఖ పాత్ర వుందనీ, స్వతంత్ర పోరాటంలో పాల్గొన్నారనీ, సబర్మతి ఆశ్రమంలో వుండి సేవ చేశారని, ఈ పోరాటాలలో యావదాస్తి పోగొట్టుకొన్నారనీ – ఏవో కొద్దిగా తెలుసు మాకు. మేము పిన్న వయస్కులం. మాకు తెలిసిందల్లా రాత్రింబగుళ్లూ ఆ పాఠశాల కోసం శ్రమించడం. ఆమె స్వీయ చరిత్ర చదివాక పూర్తిగా తెలుసుకున్నాను. ఆమె త్యాగము వెలకట్టలేనిది. అభ్యుదయ భావాలు, ఆశయ సిద్ధికి చేపట్టిన కార్యదీక్ష, చొరవగా ముందుకు సాగే తత్వం, లెక్కలేనన్ని పరిచయాలు – గాంధీ మహాత్ముని ఉత్తరాలు అందుకున్న ఘనత, రాజేంద్రప్రసాదు, రంగా లాంటి స్వాతంత్ర్య యోధులు ఆమె ఇంటికి వచ్చి ఆతి థ్యం స్వీకరించడం, ఎందరో ప్రముఖులతో ఆత్మీయ పరి చయాలు, బాంబేలాంటి సుదూర ప్రదేశాలకు అనుకు న్నదే తడువుగా వెళ్లి, స్నేహితుల యింట బసచేసి అను కున్న పని సాధించుకు రావడం – ఇవన్నీ చదువుతుంటే నా ఆశ్చర్యానికి అవధులు లేవు. ఆమె సాహసోపేతమైన నిర్ణయాలు తీసుకున్నారు. కస్తూరిదేవి విద్యాలయ స్థాప నకు ఆమె తీసుకున్న అపూర్వ నిర్ణయాలు ఒక నిదర్శన. ఒక సదాశయానికి పోరాటాలు, దృఢ దీక్షతో కార్య సాధన, ఇలా ఆమె జీవితమంతా గడచి పోయింది.

కనకమ్మ గారికి అంతటి ఆధ్యాత్మిక చింతన వుం దని మా విద్యార్థినులకు తెలీదు. శ్రీ రమణ మహర్షి, శ్రీ రామాశ్రమాలలో ఆమె అన్ని సంవత్సరాలు వుంటూ మహర్షులను సేవించారంటే నాకు అద్భుతమనిపిం చింది. ఆమె అనుభవాలను, సహ ఆశ్రమవాసుల వృత్తాంతాలను చాలా శ్రద్ధగా చదివాను. మాకు కనకమ్మ గారంటే తెలిసినది స్వల్పం. ఆమె మహాశక్తి, కారణ జన్మురాలు.

కనకమ్మ గారు, లక్ష్మీబాయమ్మ గారు వారిరువురూ అంతటి విషాదాన్ని మనసులోనే దాచుకున్నారు. విషా దం వారిని స్తబ్ధులను చేయలేదు. సమాజ సేవలో తల మునకలై అంతటి విషాదాన్ని నిస్తేజం చేశారు. కన్న బిడ్డల మరణం తాలుకు విషాదాన్ని దిగమింగుకొని కార్యో న్ముఖులై, తమ ఆశయాలకు కార్యరూపం ఇవ్వడంలో అలుపూసొలుపూ లేకుండా శ్రమించారు.

అట్టి మహనీయురాలు కస్తూరిదేవి విద్యాలయం విషయంలో తీవ్ర మానసిక క్షోభ అనుభవించారు. కమిటీ అధ్యక్షులు రామిరెడ్డిగారితో ఇండస్ట్రియల్ స్కూల్ విష యంలో అంకురించిన మనస్పర్థలు రాను రాను తీవ్ర రూపం దాల్చి, కనకమ్మ గారు ఎట్టి అధికారాలు లేకుండా విద్యాలయం మేనేజ్‌మెంట్ నుండి వైదొలగవలసి వచ్చింది. అది ఒక గొడ్డలి పెట్టు, అశనిపాతం. ఆత్మ గౌరవం మెండుగా గల స్త్రీ ఆమె. ఇంతటి అగౌరవాన్ని భరించలేకపోయారు. విద్యాలయం ఆవరణ నుండి బయటకు నడిచారు. కానీ ఆమెకున్న ప్రాథమిక హక్కు వదులుకోవడం ఇష్టంలేక, రోజూ ఉదయం పది గంట లకు రిక్షాలో వచ్చి హాస్టలు రూంలో వుండి సాయం కాలం ఇంటికి పోయేవారు. చూచిన వాళ్లకు బాధనిపిం చేది. ఆమె మాత్రం పైకి నిబ్బరంగా కనిపిస్తూ గడిపారు.

విద్యాలయ స్థాపనకు ఆర్థిక సాయం అందించారు రామిరెడ్డి గారు. కనకమ్మ గారు భూమి రూపంలో ఇతో ధిక సాయం అందించి వున్నారు. మొక్కనాటి, నీరుపోసి, కంటిరెప్పలా రాత్రింబగళ్లు కాపాడింది ఆమె. మొక్క వృక్షంగా మారడానికి కారణం ఆమె నిరంతర సేవ. పుష్ప, ఫల భరితంగా వున్న వృక్షాన్నుండి ఆమెను నిర్దాక్షిణ్యంగా నెట్టి వేయడం ఏం న్యాయం? ఎవరెన్ని అఘాయిత్యాలు చేసినా కనకమ్మగారి స్మృతిని విద్యాలయం నుండి వేరుచే యలేరు. ఆ విద్యాలయం ఆత్మ కనకమ్మ గారు. కస్తూరి దేవి విద్యాలయం అంటే కనకమ్మ గారే మదిలో మెదలు తారు.కనకమ్మగారు కొంత మంది పేద విద్యార్థినులకు హాస్టల్లో ఉచిత వసతి, భోజనాదులు కల్పించి ఆదరిం చారు. అందులో ఒకామె డాక్టర్ సావిత్రి. ఆమె తెలివై నది. ఎమ్‌డి చేసింది. ఆమె భర్త వెంకటస్వామి ఐఏఎస్. నెల్లూరులో కూడా పనిచేశారు. ఇంకొకామె లెక్చరర్‌గా రిటైర్ అయ్యారు.

(సమాప్తం)

## వైఎస్ఆర్ కాంగ్రెస్‌లో పేర్నేటి!



పేర్నేటి శ్యాంసుందరరెడ్డిని పార్టీలోకి ఆహ్వానిస్తున్న ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, జడ్పీచైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, ఎల్లసిరి గోపాలరెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి.

గూడూరులో పేరు ప్రఖ్యాతులున్న పేర్నాటి కుటుంబీకుడు శ్యాంప్రసాద్‌రెడ్డి 11వ తేది వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో చేరారు. వేల సంఖ్యలో తరలివచ్చిన అనుచరులతో పెద్ద బహిరంగసభ నిర్వహించాడు. వైఎస్ఆర్ కాం గ్రెస్ పార్టీ రాష్ట్ర అధికార ప్రతినిధి అంబటి రాంబాబు, నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజ మోహన్‌రెడ్డి, జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్ రెడ్డి, దర్శి ఎమ్మెల్యే శివప్రసాద్‌రెడ్డి, ఉదయ గిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి, సూళ్లూరుపేట మాజీ ఎమ్మెల్యే నెలవల సుబ్ర హ్మణ్యం, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, అనిల్‌కుమార్ యాదవ్, ఆనం వెంకటరమణారెడ్డి, ఎల్లసిరి గోపాలరెడ్డి, గూడూరు రూరల్ మండలాధ్య క్షుడు విజయకుమార్‌రెడ్డి తదితరులు పాల్గొ న్నారు. ఈ సందర్భంగా అంబటి రాంబాబు మాట్లాడుతూ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ వెంట నడవని నేతలకు భవిష్యత్తులేదని, వారంతా మాజీలు కావడం తథ్యమన్నారు. సభలో జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, తెలుగు దేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిపై విమర్శలు ఎక్కుపెట్టారు. ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి మాట్లా డుతూ రాజశేఖర్‌రెడ్డి లేనిలోటు భర్తీచేసే శక్తి సామర్థ్యాలు ఆయన కుమారుడు వైఎస్ జగ న్మోహన్‌రెడ్డికే వున్నాయన్నారు. జగన్‌ను సిఎం చేయాలన్న తపన జనంలో కనిపిస్తుంద న్నారు.

ఆహ్వానం కవిత

## జమీన్‌రైతు జీవప్రదాతకు అక్షర నీరాజనాలు



జర్నలిజంలో, నిబద్ధతే కొలబద్దగా చూపిన – సమర్థుడు
సమాజ రుగ్మతలపై, రణనినాదం మ్రోగించిన – సాహసికుడు
పాత్రికేయ ప్రామాణికతను, పత్రికారంగ ప్రతిష్ఠను – పెంచినవాడు
రైతుల స్థితి, వ్యవసాయ పరిస్థితి, తెలిసిన – కలం హాలికుడు
ముల్లు – మొగ్గతో ఆత్మావలోకనం గావించిన విమర్శకుడు
ఉన్నమాట నాదంటూ, ఉద్యమాలు నడిపిన ఉదాత్తుడు
పినాకినీ తీరంలో పాఠకుల డెందాన్ని దోచిన దురంధరుడు
నా కలంకు చేతగాదంటూ, జిల్లా నేతల రాతలు మార్చినోడు
రాష్ట్ర రాజకీయ విశ్లేషణలో రాటుదేలిన మేటికాడు
మేడల్లో మెలిగే వారిపై, గుడిసెల్లో కుమిలేవారిపై
సమవార్తలందించిన సమున్నతుడు
ఎన్నికల యొక్క ఫలితాలను గూర్చి భలేమంచి జోస్యకాడు
నెల్లూరు మాండలికానికి గుడిగట్టిన మహోన్నతుడు
కుటుంబ రాజకీయాలపై తన కలం కొరడా ఝుళిపించి ధీరుడు
కళారాణి – చంద్రికారాణి హత్యల్లో కలాన్ని త్రిశూలంగా వాడినవాడు
సతత శుద్ధ ఖద్దరుదారి – జమీన్‌రైతు జీవ ప్రదాత
స్వర్గీయ శ్రీరామమూర్తి గారు
తరలిపోయి 18 సంవత్సరాలు గడిచె, ధరాతలము నుండి
తరలిపోలేదు జమీన్‌రైతు పాఠకుల స్మృతి పథము నుండి
అందుకే అందుకోండి మీరు మా అక్షర నీరాజనాలు...

**–తనిశెట్టి వెంకట రమణయ్య,** M.A., మాచర్లవారిపాళెం.

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11

# మార్కెట్ స్థలం కొట్టేయాలన్న ప్రయత్నాన్ని అడ్డుకొన్న సిఎం!

## స్టోన్‌హౌస్‌పేట వ్యాపారస్తులతో దరఖాస్తు పెట్టించిన వివేకా.



కూరగాయల మార్కెట్ ప్రక్కన వంద కోట్ల రూపాయల విలువ చేసే కోనేరు స్థలం.

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డికి పూనకం వచ్చింది. 12తేది మధ్యాహ్నం మద్రాసు బస్టాండ్ దగ్గర కూరగాయల మార్కెట్‌లో వీరంగం ఆడారాయన. ఆయన పైత్యానికి కారణం – 11తేది పొద్దున ఈనాడు దినపత్రికలో వచ్చిన వార్త. మార్కెట్‌కు చెందిన కోనేరు స్థలాన్ని ఒక ముఖ్యనేత తన స్వంతం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడని ఆ వార్త సారాంశం. ఆ పత్రికలో ఎవరి పేరూ వ్రాయలేదు. నెల్లూరు జిల్లాలో వివేకానందరెడ్డి ఒక్కడే ముఖ్యనేత కూడా కాదు. అయినాసరే ఆయనకు దాన్ని చూడగానే పైత్యం ప్రకోపించింది. గుమ్మడికాయల దొంగెవరంటే భుజాలు తడుముకొన్నట్లు, గంగ వెర్రులెత్తి పోయాడు. ఏనుగుకు కలలో సింహం కన్పించినా ఒళ్లు కంపించి పోతుందట. వివేకానందరెడ్డి విషయంలో 'జమీన్‌రైతు' వారపత్రిక సింహం కంటే భీకరంగా కన్పిస్తున్నదిప్పుడు. ఈనాడు దిన పత్రికలో వార్త వస్తే, 'జమీన్‌రైతు' మీద విరుచక పడ్డాడాయన. తాను ఎంతో కష్టపడి అభివృద్ధి కోసం శ్రమిస్తుంటే, 'జమీన్‌రైతు' వారపత్రిక తనకు అడ్డంకిగా వస్తున్నదని, తన సంస్కారానికి అతికినట్లు సరిపోయే భాషలో రీతిలో తిట్ల దండకం పఠించాడు. వ్రాయడానికి వీలు కాని భాషలో రెచ్చిపోయాడు. పిచ్చి పట్టినవాడి వలె ప్రవర్తించాడు. 'జమీన్‌రైతు' సంపాదకుడిని కుళ్లిన కూరగాయలతో కొట్టమని మార్కెట్‌లోని వ్యాపారస్తులకు పిలుపు ఇచ్చాడు. పిల్లి శాపనార్థాలకు వుట్లు తెగవు. పిల్లి శాపనార్థాలకు వుట్లు తెగుతాయా? వివేకానందరెడ్డి బెదరింపులకు 'జమీన్‌రైతు' పత్రిక భయపడుతుందా?

ఇంత రభసకు కారణం – వంద కోట్ల రూపాయల విలువైన కోనేరు స్థలం చేజిక్కించుకోవడానికి తాను చేసిన దుర్మార్గమైన ప్రయత్నం విఫలమైందన్న ఆక్రోశం. ఎప్పుడో బ్రిటీష్ హయాంలో కట్టిన కోనేరిది. నెల్లూరు చెరువు నుంచి నీటి

కొరవ 14వ పేజీలో



ఉత్తరక్రియలు

ప్రేమానురాగాలు పంచిన అమృతమూర్తి,
మంచితనం, మానవత్వం మూర్తీభవించిన
మా ఇంటి వెలుగు, మా తల్లిగారైన

**శ్రీమతి దేవరాల శేషమ్మగారు**

తేది 02-07-2011 శనివారం మమ్ములను వీడి
దైవసాన్నిధ్యం చేరారు. వారి పవిత్రాత్మకు శాంతిని
ప్రసాదించమని భగవంతుని ప్రార్థిస్తూ... శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

**కుమారులు - కోడళ్లు**
దేవరాల సుబ్రహ్మణ్యం యాదవ్ - మస్తానమ్మ
దేవరాల శ్రీనివాసులు యాదవ్ - రాజేశ్వరి
దేవరాల వెంకట సుబ్బయ్య యాదవ్ - రాధ

**కుమార్తెలు - అల్లుళ్లు**
చిట్టిబోయిన రత్నమ్మ - పెంచలయ్య యాదవ్
తోడేటి రమణమ్మ - వెంకటరత్నయ్య యాదవ్
చెముకుల బుజ్జమ్మ - వెంకయ్య యాదవ్
చెముకుల సుగుణమ్మ - రామయ్య యాదవ్

**మనుమలు - మనుమరాళ్లు**
దేవరాల వెంకట సురేష్‌బాబు - కవిత
దేవరాల వెంకట సతీష్‌బాబు - సుశాంతి
మహేష్, మౌనిక
ఆనందిని, అనూష

**మునిమనుమలు మునిమనుమరాళ్లు**
మనోరథ్, కృష్ణ మహీరథ్
మనస్విని, మోక్షిత్

మరియు కుటుంబసభ్యులు

**శ్రీమతి దేవరాల శేషమ్మ గారు**
కీ॥శే॥ శ్రీ దేవరాల వెంకయ్యగారి సతీమణి
మరణం : 02-07-2011

**: పెద్దకర్మ :**
20-07-2011 బుధవారం
ఉదయం 11-00 గంటలకు
4/1167, కృష్ణమందిరం వీధి,
ఉస్మాన్‌సాహెబ్‌పేట,
నెల్లూరులోని మా స్వగృహము నందు జరుగును.
బంధుమిత్రులకు తెలియజేయడమైనది.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.